ఓమ్
శ్రీ సూర్యనారాయణ పరబ్రహ్మణే నమః.

# కామ్యసిద్ధి

అష్టావధాని, మ. రా. శ్రీ

బండి వేంకటరామిరెడ్డిగారిచే

విరచితము.





బెజవాడ
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
కుందా లక్ష్మీనరసయ్యగారిచే
ముద్రితము.
1937



[వెల రు 1-0-0.

స్వీయకవిత్వారాజ్యరమ ◆
చేకొని యిందునఁ జేయువాఁడ స్వే
చ్ఛాయితమౌ ప్రభుత్వమును ◆
హాయిగ నింత్రొకఁ డడ్డు లేదు ఇం
దేయెడనైన హద్దుల గ ◆
మింపఁగఁ బోవకయుండ సౌఖ్యశో
భాయిత మౌను, సత్కవిత ◆
లారయ నాత్మసుఖం బొసంగవే.

ఓమ్

శ్రీ సూర్యనారాయణపరబ్రహ్మణే నమః

# తొలిపలుకు

పాఠక మహాశయులారా!

నేనీనాటకమును నేటికి నాలుగువత్సరములకిందట రెండుభాగములుగ పూరించియుండియు ద్రవ్యాభావముచే నేటివరకు ముద్రింపలేక పోయితిని. ఇప్పటికి ఈప్రథమభాగము మ॥ రా॥ పుచ్చకాయల పుల్లారెడ్డిగారికి కృతియొసంగఁబడి ముద్రింపఁబడినది. దీనియందలి నాంది, పీఠిక, నాటకము అచ్చువేయించునమయముననే వ్రాయఁబడినవి. ఈనాటకమున 'ర, ల'లకు మైత్రి కొందరిమతమనుకూలించుటయు మరికొందరు వ్యతిరేకించుట తెలిసియు తగునను నమ్మకముతో వ్రాయఁబడియెను. ఇంకను 'ఇంప,ఇంచుక'అనువానిసంధులకు 'ఏ ఏ ఋ' కారములకు మైత్రిఁగూర్చుట వలదని ఛందోవ్యాకరణములు పలుకుచున్నను పూర్వకవిప్రయోగములు కుప్పతెప్పలుగ కనఁబడుచుండుటచే వ్రాయంబడినవి. చుండగ - నెలతుక - చెలరేగు - కౌగిలి - కలత - సీసములు - గీతములందలి - చరణాంతములకు సరళాదేశమగు చోటులను, తలపు - సాకు - విన్నదనము - ఏచు ప్రదేశములను ఇంకను అరసున్న లెన్నియో చోటుల తొలఁగఁబడినవి. ఈగ్రంథమున ఇంకను నేవేని వింతప్రయోగములు కానుపించిన అయ్యవి తెలిసి వ్రాయఁబడినవేకాని ప్రమాదమున నావహిల్లినవి కావని విన్నవించుకొనుచున్నాఁడను.

ఇట్లు,

బండి వేంకటరామిరెడ్డి,

అష్టావధాని.



మ. రా. శ్రీ పుచ్చకాయల పుల్లారెడ్డిగారు

శ్రీసూర్యనారాయణపరబ్రహ్మణే నమః.

# కృతిసమర్పణము



నివాసంబు సజ్జన♦సేవ్యమాన
మఘవిరహితంబు విమలసౌ♦ధాంచితంబు
అంజనావరసుతసంస్థి♦తాలయంబు
వేంకటాపుర మానంద♦విభ్రమంబు.

వ॥ తత్పురంబున.

తే॥ పుచ్చకాలన్వయాంభోధి♦పూర్ణిమవిధుఁ
డమలగుణరాశి భక్తలో♦కాగ్రగణ్యుఁ
డతులధర్మకార్యాచర♦ణాంతరంగ
కలితుఁ డనఁగ పుల్లారెడ్డి ♦ నలలితగతి.

క॥ ఒకనాఁడు తనపురికి నను
బ్రకటితగతిఁ బిలువఁబంచి ♦ పలికెను పేర్మిన్
సకలరసంబుల రఘునా
యకుచరితము మాకు కృతిగ ♦ నలరింపు మనన్.

చ॥ అది వినునంతపైన ముది♦తాత్ముఁడనై రఘురాముచారితం
బిదియు తదీయభక్తుఁ డితఁ♦ డెంతయు నొప్పునటంచు నేకృతిన్
బదిలముగా రచించి కవి ♦ పార్థివు లుల్లసిలంగ కావ్యమున్
సదమలలంకృతాత్మునుగ ♦ సల్పితి ముద్దుల మూటగట్టఁగన్.

## కృతిపతివంశవర్ణనము

సీ॥ లోకబాంధవుఁ డన ♦ యూఢిమై తతనిభా
ఘనస్ఫూర్తిఁ దనరిన♦ఘనునిఁ దెగడి
విధుఁ డనంగను తాను ♦ వెలసియు కొంటెల
జత విర్వాణుల నేచు♦సాకుఁ జూపి
శంభుండు నాఁ బ్రశం♦సను గాంచి విలయమ
హానటమూర్తి యా♦టలతి దెలిపి

కనకగర్భుం డనం♦గా నయ్యె జనుల కె
ద్దడిగూర్చువ్రాతల ♦ తప్పి బలికి
తే॥ తాపమును గూర్చ కలతుల♦దారిఁ జనక
క్రుద్ధభావంబు నిడక ని♦కృష్టము లగు
వ్రాతలను వ్రాయఁబోవక ♦ వసుమతిపయి
రామిరెడ్డి యనంగ ని♦ర్వ్యాజమూర్తి.

క॥ చన్‌బండ యను పురిన్ గనం
గన్ బహు విభవముగ రాము ♦ కరుణాకరు క్రి
న్నన్ బేర్మి నాలయమ్మును
హొన్నుగ రచియించె జను లహో♦యని పలుకన్.

వ॥ ఆతండు.

క॥ పతిహితవ్రతనరతలై
అతులితధర్మప్రవీణ ♦ లయి యెందున్ సువ
సతి బుచ్చమాంబ యన నం
చితగుణ సీతమ్మ యనఁగ ♦ శీలవతులలోన్.

సీ॥ చండశాసన మిడె ♦ సవిత్రు వెల్వడఁ జత్తు
వని పతికోరకయి ♦ అతివ సుమతి
ముమ్మూర్తులను క్రోధ♦మూర్తియై శాసించి
పాప లట్లనసూయ ♦ బరపె శక్తి
జము బెదరించి శా♦శ్వతసుఖంబుల విభుఁ
గూడె సావిత్రి నాఁ ♦ గులవయాక్షి
చండకల్లోలభీ♦షణవహ్నికీలల
కట్టెదురయి నిల్చి ♦ కడకతోడ
తే॥ భర్తశవముతో వహ్నిలోఁ ♦ బడఁగ నురికి
సహగమనధర్మమును జూపె ♦ సాధ్వి బుచ్చ
మాంబ.........ఆపె కునే సాటియమా మహితచరితకనముగా
యెన్నియ్యుగముల్లు గడచినను
ఉ॥ అందున సీతమాంబికకు ♦ నాత్మజుఁడై బుధసంస్తవార్హుఁడై
చందనకుందచంద్రఘన♦సారతుషారమరాళచంద్రికా

స్పందయశోవిరాజితుఁడు ♦ సామజసత్త్వుఁడు జువ్వరెడ్డి నా
నెందున ధర్మమూర్తి సుజ♦నేప్సితదాయియునై ప్రవర్తిలెన్.

తే॥ అతఁడు వెంకాంబ యనఁగఁ జె♦న్నయినయట్టి
సాధ్వివలనను గనియెను ♦ సత్యమూర్తి
అప్పిరెడ్డి యనంగ ధ♦ర్మైకలోలు
బుధహితంకరు నెందు సం♦పూజ్యయశుని.

క॥ సరసగుణాంచితుఁ డన సుం
దరతరవిగ్రహుఁ డనంగఁ ♦ దనరిన కీర్తిన్
పరుసపథంబుల నడువని
పరముఁ డనఁగ నప్పిరెడ్డి ♦ ప్రస్తుతిఁగాంచెఁ.

సీ॥ తనుఁబట్టి యేరికి ♦ దానమిచ్చునో యని
అలలఁ గప్పికొనె ర♦త్నాకరుండు
ఉవ్వెత్తుగా దాన♦ మొసగు మేరువు నని
కనులు మూయక దేవ♦గణము కాచు
ఏయర్థిజనపాళి ♦ కిచ్చునో యని లక్ష్మి
నిజవక్షమందున ♦ నిలిపె శౌరి
ఏవేళ బీదల ♦ కీగిసేయునో యని
కైలాసమున శూలి ♦ కాపురమిడె

తే॥ నిరవధికకీర్తిపుంజముల్ ♦ నిఖిలదిశల
వెలుఁగ ధర్మరూపంబు తా♦ వెలుఁగులీను
అప్పిరెడ్డిదాతృత్వము♦ నరసి భీతి
యెదలఁ దవులగ నిలిచిరి ♦ మది మరిచెడి.

తే॥ అతఁడు సుబ్బాంబ యనఁ జను♦నతివయందు
ఆత్మజుని రామిరెడ్డి నా♦ నలరువాని
గనియె అంభోధి చందురుఁ ♦ గనినకరణి
ఆత్మవంశాబ్ధి కానంద♦ మతిశయిల్ల.

సీ॥ సత్యభామల హరి♦శ్చంద్రుం డటంచును
వితరణంబున బలి♦జత యటంచు

ధర్మవర్తనమున ♦ ధర్మజుం డంచును
గాంభీర్యమున నబ్ధిఁ ♦ గడచు ననుచు
లోకపాలనమున ♦ లోకేశ్వరుం డంచు
మహితవర్తనమున ♦ మను వటంచు
వీక్షణంబున శీత♦వీక్షణుం డంచును
తేజాన భాస్కరతేజుఁ ♦ డనుచు
తే॥ కవులు సహజభావంబులు ♦ గాఁగ తన్ను
నెల్లవేళలఁ గీర్తింప; ♦ జల్లుపొల్లు
గననిసడవడితో కీర్తి♦గాంచె నతఁడు
రామిరెడ్డి వదాన్యతా♦రాజమౌళి.

వ॥ ఆతండు.

తే॥ నాగమాంబిక యనియెడు ♦ నాతిమిన్న
విహితధర్మానుసరణిగాఁ ♦ బెండ్లియాడి
అఖిలసద్వ్రతంబులఁ జేసి ♦ అనఘులైన
సుతుల ముువ్వురఁ గనియెను ♦ మతియుతులను.

క॥ ఘనుఁ డగుచెన్నారెడ్డిని
ననుపమసుగుణాఢ్యు పుల్ల♦యాఖ్యుని బేర్మిన్
ఘను వీరమల్లరెడ్డిని
తనయుల ముువ్వురిని ♦ మూర్తిత్రియమటుల గనియెన్.

సీ॥ ఇచ్చువేళలయందు ♦ నెల్లరు విన ఘన
గర్జనంబును చేయఁ ♦ గాంచకున్న
తనుఁ బరీక్షింపఁగా ♦ దానం బడుగ నీరు
గోసి త్యాగంబుగాఁ ♦ గూర్పకున్న
సర్వలోకాధిపుల్ ♦ సంస్తుతింపఁగనయ్యు
నెముక దానంబుగా ♦ నీయకున్న
త్రిదివనాథుఁడు భిక్ష ♦ దేవురింపఁగ హాయ
చర్మంబె యీఁగిగా ♦ నలుపకున్న
తే॥ ఘనుఁడు శిబియు దధీచియు ♦ కర్ణుఁ డతుల
దానగుణసమంచితుఁ డన్నఁ ♦ దనరుపుచ్చ

కాల చెన్నరెడ్డికి సాటి♦గాఁగఁ బలుక
దగు నటన్నచోవీతే రన ♦ నగదె జగము.

సీ॥ జనకుని వధియించు♦నఘ బాపుకొన పృథ్వి
నవతరింప నగుప్రి♦హ్లాదుఁ డనఁగ
కలహాభోక్త యటన్న♦పలుకు దోపిడిచేయ
జననమా నారద♦సంయమి యన
దాసకన్యకఁ గూడు♦దోస ముత్సర్జింప
జన్మింప నగుపరా♦శరుఁ డనంగ
మరదండ్రితోడ స♦మ్మతిఁ గూడగా నైన
వాడు వీడ్వడఁ బుట్టు ♦ వ్యాసుఁ డనఁగ
తే॥ అరుదు గననైన దగుచు న♦వ్యాజ మగుచు
ప్రవిమలానందకందళ♦ద్భవ్యహృదయ
నిస్తులైశ్వర్యకలితని♦ర్ణిద్రభక్తి
యుతుఁ డనఁగ పుల్లరెడ్డి దా♦ సతము దనరె.

సీ॥ సీత నన్వేషింప ♦ శ్రీరామునకు కరు
వలిసూతిసాయము ♦ భంగిగాఁగ
ఆమహామహునకు ♦ నయ్యె చేదోడుగా
సంకల్పగతి పనుల్ ♦ సలుప పద్మ
సాలికులస్థుండు ♦ శాంతుండు మాడెమ
చక్రయ్యసుతుఁ డనఁ ♦ జనినవాఁడు
అప్పలస్వామి శి♦ల్పాచార్యుఁ డాతండు
నిజబుద్ధి నేర్పుగా ♦ నేరనట్టి
తే॥ పనులు వేరొండు లేమిని ♦ తనకు నమ్మ
కంబుగా నిల్పి చన్ బండ♦గ్రామమందు
వెలయుకోదండరాముని♦నిలయమునకుఁ
దగు మరమత్తు జేయించి ♦ ధర్మబుద్ధి.

సీ॥ దేవాలయము చుట్టి ♦ దీర్చి ప్రాకారము
తెరమంటపము వేడ్క ♦ బరగఁ గట్టి

గాలిగోపుర మతి♦ఘనముగాఁ గల్పించి
యాగశాలను జేసి ♦ యధికభక్తి
కల్యాణమంటప♦ఘనకార్యమును జేసి
వాహనములకొట్టు ♦ వరల నిల్పి
తగ విమానంబుపైఁ ♦ దగుశిల్ప మొనరించి
ఆంజనేయునిగుడి ♦ యాలయంబు

తే॥ కెదుర నిర్మించి హనుమను ♦ ప్రిదులఁబోని
భక్తితో ప్రతిష్ఠనుజేసి ♦ భవ్యవిధిని
పుష్కరిణి త్రవ్వగాఁ జేసి ♦ పూన్కి తీర
మందు హనుమ ప్రతిష్ఠించె ♦ నలఘుగతిని.

వ. మరియు కిరీట భుజకీర్తి కుండలమ్ముల సీతారామలక్ష్మణులకు క్రమముగాఁ జేయించి.

తే॥ వేంకటాపురమందున ♦ విలసితవిధి
ఆంజనేయాలయంబును ♦ నందున ధ్వజ
స్తంభమును ప్రతిష్ఠజేసి ♦ స్థావ్యముగను
వరణమును గట్టగాఁజేసె ♦ నురుతరనిధి.

---



# కావ్యసిద్ధి

## (నాంది)

తే॥ శ్రీద మవ్యయానందంబు ♦ సేవ్యమాన
నిఖిలతాపసహృదయమ్ము ♦ నిర్వికార
మమల మఘువిరహితము ని♦త్యానవద్య
మైన బ్రహ్మము మీకిచ్చు ♦ నాత్మసుఖము.

(అంత సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర—(తనలో) నెలఁతలకు లలితాలంకారములయందలిప్రీతి మెండు. ఈమెసింగార మింకను తుదిముట్టనట్లుగ కనుపట్టుచున్నయది. మంచిది, ఒకమారు పిలిచెదఁగాక. (ప్రకాశముగా) సుందరీ! ఒక్కమా రిటు రమ్ము.

(తెరలో) ఆర్యా! వచ్చుచుంటిని.

సూత్ర—ఓహో నీవిలాసముల నవరించు టింకను ముగియలేదా?

నటి—(ప్రవేశించి చిరునగవుతో) ఎల్లయెడ నిట్లుగనే పరిహసించుచుందురు. నేఁ డేల యింత త్వరపడుచుండిరి?

సూత్ర—ఇంకను నాత్వర నీకు బోధపడలేదా?

తే॥ కవులు పండితుల్ సవిమర్శ♦కాగ్రిణులును
భూపతులు నిండఁగా సభ ♦ పొల్పు మిగిలి
ప్రకటితోల్లోలకల్లోల♦భాసుర మగు
అబ్ధి చందురుఁ గన వేడ్క ♦ నలరునట్లు.

నేఁటిదినమున పురాణ పుణ్య చారిత్రముఁ గన నుత్సహించుచుండిరి.

నటి—మంచిది, దానినామధేయము వినవచ్చునా?

సూత్ర—కామ్యసిద్ధి యనునామాంతరమునఁ బ్రవర్తిలు శ్రీరామచరిత్ర ప్రథమభాగము.

నటి—మంచిది, సహజ కవితా మాధురిచే నీరంగస్థలమును మెప్పింపఁ గలవాఁడగునా కవి?

సూత్ర—కవియే గ్రంథమున ఇట్లు వ్రాసికొని యున్నవాఁడు.

సీ॥ అష్టావధానక♦ష్టావలంబనమున
నిర్వేలమగుకీర్తి ♦ నెగడువాఁడ
అవధానమధ్యమం♦ దతిమనోహరముగా
ఆశువుగ చరిత్ర ♦ లల్లువాఁడ
విద్వత్కవీశ్వరవితతి ♦ మెచ్చెడిరీవి
కైత వ్రాయఁగ ♦ నేర్పుగాంచినాఁడ
శివరామకవివర్య♦శేముషీఖని నాత్మ
గురునిగా నెమ్మదిఁ ♦ గూర్చువాఁడ
తే॥ ప్రియము మెయి వేంకటరామి♦రెడ్డి యనుచు
జనులు పిలుతురు వ్రాసితి ♦ శ్రావ్యఫణితి
ననుచు తలఁతురు చదువరు ♦ లరయునపుడు
తలపు లెటులైననున్ సమ్మ♦తంబ నాకు.

మంచిది, అట్లయిన కానిండు.

(అంత తెర పడును)



శ్రీ

సూర్యనారాయణపరబ్రహ్మణే నమః.

# కావ్యసిద్ధి

## ప్రథమాంకము

రంగము : సాకేతపురము - కొలువుకూటము.

[దశరథుఁడు - సుమంతుఁడు - వసిష్ఠుఁడు - ప్రవేశము.]

దశ—సుమంతా! బిడ్డలు సర్వేశ్వరానుగ్రహంబున సకలవిద్యాపారీణులైనటుల వినుచుంటిమి. విశేషము లేమి?

సుమం—ప్రజలందరు నానందకందళితహృదయారవిందులై శ్రీరామ రాజ్యంబనుచు దైనందినోత్సవంబులఁ దేలియాడుచుండిరి.

దశ—సుమంతా! శుభలక్షణలక్షితుఁడగు శ్రీరాముని కనుగుణయగు కన్య యెట లభ్యమగునోకదా?

[అంత ఒకభటుఁడు ప్రవేశించును.]

భటుఁడు—ప్రభూ! నమస్కారము.

సుమం—ద్వారపాలకా! యే లరుదెంచితివి?

భటుఁడు—ద్వారముకడ విశ్వామిత్రమునీంద్రులు వేచియుండిరి.

దశ—మంచిది, ప్రవేశపెట్టుము.

[అంతట విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

(దశరథుఁడు సుమంతుఁడు ఎదుర్కొని అర్ఘ్యాసనాసీనుం జేయుదురు.)

విశ్వా—దశరథా!

తే॥ సత్యమార్గంబు దప్పక ♦ సర్వజనులు
ధర్మశాస్త్రనిబద్ధులై ♦ తనరుచుండ
పాలనముఁ జేయుచుందువే ♦ ప్రౌఢనీతి
దయయు శాంతము నీమదిఁ ♦ దవులుకొనఁగ.

దశ—మునిచంద్రమా! అంతయుఁ దమ కృపాపీయూషవర్షంబు మా యెడ వర్షించుచున్నంతవరకుఁ గొరంత యనునది కలుగనేరదు.

విశ్వా—దశరథా! అన్నింటికిఁ గారణకర్తయగు సర్వేశ్వరుండు ప్రధానుఁడు.

దశ—బ్రహ్మఋషిసత్తమా! తా మెద్దియో కారణము లేకుండఁగ విచ్చేయరని తలంతును. మహామునీంద్రులగు తమయాజ్ఞఁ బురస్కరించుకొని యెట్టిదుర్ఘటకార్యంబైన నాచరంతును. వచ్చినకార్యము సెలవిండు.

విశ్వా—దశరథా! వినుము.

చ॥ దశరథభూమిపాలకుఁ డు♦దారమనస్వి సుతార్థియై నిరం
కుశగతి నశ్వమేధ మొడఁ♦గూరఁగఁ జేయుట చిన్నిపాపలన్
శశిసమమూర్తులన్ గనియె ♦ జాతకమాదిగ సత్క్రియాదు లా
శిశువులకున్ వసిష్ఠముని ♦ సేయఁగనుండె నటంద్రు సేమమా.

దశ—మునీంద్రా! కుమారులు సర్వవిధశస్త్రాస్త్రవిద్యా జితపరిశ్రములై సేమంబుగ నుండిరి. ఇట్టి సంతోషసమయమున దర్శన మొసంగిన ధూర్జటికల్పులగు తాము కోరిన కోరిక యెద్దియైన వెనుదీయక యొనర్చుట కుత్సహించుచుంటిని.

విశ్వా—దశరథా! ఇత్తువుగా! ఇచ్చెదనని యాడి తిరుగవుగా! ముమ్మాటికి నీనిశ్చయాభిప్రాయ మిచ్చుటయే యగునుగా!

దశ—ఋషిచంద్రా! రఘువంశోద్భవుండగువాఁడు ధరామండలంబున నాడితిరిగెననుమాట విని కని యున్నవారు లేరు. అట్టిదానికై మరింత వక్కాణింపఁబనియుండదు. ముమ్మాటికి ఆడితిరుగను.

విశ్వా—రాజా! ఇత్తును, వేఁడుకొమ్మని పలికి బొంకని యుత్తమ వంశీయుండవగు నీవాక్యంబుల నూతగాఁ గొని యడుగుచుంటిని.

చ॥ సవనముఁ జేయువేళల ని◆శాచరతండము మూగి మాంసులన్
గవయుచు భీకరాకృతులు◆గా పిడకే ల్వడి నీడ్చి కట్టి మా
భవముల కిద్ది మోక్ష మని ◆ పల్కి జటావళు లూడలాగి యా
గవితతి మాన్పి గడ్డములఁ ◆ గాల్చి నిరంకుశవృత్తిఁ జూపగాన్.

మాకర్మంబు లిట్లుండెను. వారల నిరంకుశ ప్రభుత్వము లట్లుండెను. వీనినన్నింటిని మాయింప లోకోపకారం బొడఁగూర్ప సమర్థుఁడగు శ్రీరామచంద్రునిఁ దోడ్కొని చన వచ్చితిని. నాయనుగమనంబున రాఘవుండును కల్యాణకలితుం డగును. నేను కోరునదియు నీవు తీర్పునదియు నిదియే.

దశ—సంయమీంద్రా! యెట్టిమాటాడితిరి? బాలుండగు రాముఁ డేమి చేయగలఁడు? ఈ తమహృదయంబును మార్పుఁడు. ఒండుమార్గ మాలోచింపుఁడు.

విశ్వా—దశరథా! యెట్టిమాట పలుక సాహసించితివి? సూర్యవంశోద్భవుం డగువాఁడు అసత్యమాడుట విని కని యున్నవారు లేరంటివిగాదా! యెంతలో నెట్లు మారిపోతివి?

దశ—(దీనవదనముతో) సంయమివర్యా! తామిప్పట్టున నావాక్యము లెట్లెంచి యెట్లాడినను సరే! యీవిషయంబున నిదియె ముమ్మాటికి వచించుచుంటిని. దయయుంచి క్షమింపుము. రాముం డకృతాస్త్రుఁడు.

విశ్వా—(కోపముతో) ఓరీ! పిరికిపందా! ఇదివరకు ముమ్మాటికి కోరిన దెద్దియైనను దీర్తునని, కోరినపిదప ముమ్మాటికిఁ దీర్పఁజాలనని యనుచుంటివా! కల్లరీ! రాముం డకృతాస్త్రుండని పల్కుచుంటివా! అకృతాస్త్రుండైనను నా వెనుపాటుకలిమి కృతాస్త్రునిగ భావింపు. బాలుండైనను ప్రౌఢునిగ నెంచుము. దుర్బలుండైనను బలసమేతుండని తలంపుము. అటుగాక రామునికే యపాయము సంభవించుచో నీలోకంబులట్లుండవు. సూర్యచంద్రుల గమననిరోధంబు గావలయును. నక్షత్రపూగంబు లిలపై డుల్లి పడవలయును. గ్రహంబులు తారుమారుగావలయును. వేయేల!

చరాచరజంతు సంవృతం బగు ధరాతలంబెల్ల నర్ధనిమేష మాత్రింబున భస్మపటలంబు కావలయుననని యెరుంగుము.

వసి—రాజా! మారాడక రామలక్ష్మణుల నిమ్మునిశార్దూలునివెంటఁ బనుపుము. ఈతపోధనోత్తముఁడు విధాతసృష్టికిఁ బ్రతిసృష్టి జేయనైన శక్తిమంతుఁడు. ఈతనివెనుకఁజను నీబిడ్డలను ఫాలాక్షుండేనియుఁ గన్నెత్తిచూడఁజాలఁడు. అచిరకాలమున కల్యాణోపేతులైన నీబిడ్డల దర్శింతువు.

దశ—(విశ్వామిత్రున కెదురయి నిలిచి హస్తముల జోడించి) మునీంద్రా!

తే॥ కాతరత్వంబుననుజేసి ♦ కలతవడిన
మనముననను పుత్రమోహము ♦ బెనగొనంగ
నెద్దియో పల్కినాఁడ స♦ద్బుద్ధి గలిగె
నార్షచంద్రమ! నన్ గృప ♦ నరయుమయ్య.

విశ్వా—(ప్రసన్నవదనముతో) దశరథా! పుత్రవ్యామోహ మెంతటి వానిచే నెట్టికార్యంబైన చేయించును. మదీయహృదయపీడనము జరుగకుంటచే అసత్యదోషము నీ కంటనేరదు. లెమ్ము, హృదయమ్మును భద్రపరచుకొమ్ము.

దశ—(లేచి ఆసీనుఁడై) సుమంతా! రామలక్ష్మణులందోడుకొనిరమ్ము.

సుమం—చిత్తము. (అని నిష్క్రమించి)

[రామలక్ష్మణసహితుఁడై ప్రవేశింపవలయును.]

దశ—రామచంద్రా! వసిష్ఠవిశ్వామిత్రమునీంద్రులకు నమస్కరింపుఁడు.

రామ—(విశ్వామిత్రవసిష్ఠులకు నమస్కరింతురు)

విశ్వా—బిడ్డలారా! కల్యాణ మగుఁగాక!

వసి—సమస్తదిగ్విజయకీర్త్యభివృద్ధిరస్తు!

విశ్వా—రాజా! వెళ్లివచ్చెద.

దశ—చిత్తము. (అని నమస్కరించును)

అంతట రామలక్ష్మణసహితుఁడై విశ్వామిత్రుఁడు నిష్క్రమించును)

---

రంగము : సరయూగంగాసంగమప్రాంతవనభూమి.

[రామలక్ష్మణసహితుఁడగు విశ్వామిత్రుఁడు ప్రవేశించును]

విశ్వా—రామా! స్నానమాచరించితిరా?

రాము—చిత్తము.

విశ్వా—తే॥ బలయు నతిబలయు ననఁగను ♦ పరమమంత్ర
రాజముల జపియింప ని♦ర్వ్యాజశక్తి
ఆకలియు దప్పికయు మాన్పు ♦ నయ్యు మనుజు
తేజమును దుపవా యవి ♦ తెలియపరతు.

రాము
లక్ష్మ } (పఠింతురు)

విశ్వా—రామా! యిప్పుడియే తాటకవసించువనము. ఇందామాన వాశిని నిరంకుశప్రతాపమున తనయాజ్ఞం జెల్లించుచుండును. ఇంక నాలుగడుగులు నడచి నప్పుడియోనర్పిన పరతెంచును.

రాము—మునీంద్రా! ఆఁడుదానిం జంపుట మహాపాతకంబనిక దా ధర్మశాస్త్రంబులు పలుకుట. అనుచితకార్యమె ట్లాచరింపు మందురు?

విశ్వా—రామచంద్రా! సకలజనసమ్మతమగునదియు సాధుజనసంతా పాపహారిణియగునట్టి దెట్టిబెట్టిదమగు కార్యమైనను చేయ నగును. సర్వజనకంటకంబై సాధుజన భయావహం బగునట్టి దెట్టి ధర్మకార్యం బైనను జేయరాదు.

తే॥ హింస పాపంబయైనను ♦ శంసితమగు
వ్యాఘ్రమును జంప గోవధ ♦ బరగుకతన
సత్యమయ్యు పులోమజ♦ జాడఁ దెలియఁ
బలికి భృగుశాపమున మున్ను♦ పడఁడె వహ్ని.

ధర్మసూక్ష్మంబు లిట్లుండుఁగావున లోకాపకారిణియగు దీనిం జంపి పితృపితామహసమార్జితమగు యశస్సామ్రాజ్యంబున పట్ట భద్రుండవు కమ్ము.

రాము—మంచిది. గురూత్తమా! తమ యాజ్ఞానువర్తి నయ్యెద. (అని శింజినీటంకార మొనర్చును.

లక్ష్మ—అన్నా! ఆ దెసఁ జూడుము, దుమ్మురేగుచుండెను. తన్మధ్యంబున నొక్క భయంకరరూపము నాట్యమాడుచు పరతెంచుచున్నయది, లక్షించితివా?

విశ్వా—రామా! అల్లదిగో తాటక పరతెంచుచున్నయది. కంటివా? దర్శనమాత్ర సకలజీవసంఘహృదయపుట నిర్మథనదక్షమగు దానిభీకరాకారము.

తాట—[ప్రవేశము] (ప్రకాశముగా) అరే మానవాధములారా! మదీయాజ్ఞాపాలిత మగు నీయటవీమధ్యంబున కేల వచ్చితిరి? వచ్చుటయేకాక శింజిని నేల మ్రోయించితిరి? దీనిఁ బోల్చి చూడ మీకు ప్రాణంబులపై నిచ్ఛ లేకుండుట గన్పట్టుచున్నయది. ఇదిగో మిమ్మొక త్రుటిమాత్రంబున యమసదనమున కనిచెద, నిలుండు.

లక్ష్మ—అగ్రజా! ఇంక నీమానవాశినిపై దయ వహింపఁజనదు. స్త్రీ యని కనికరించిన దీనిమద మెక్కుడగుచున్నయది. (అని శరప్రయోగ మాచరించును.)

తాట—అరే దుర్మదాంధులారా! బాలురని దయఁదలంచిన పైకెక్కుచున్నారా! (అని ఉరవడితో నేతెంచవలయును.)

రాము—సోదరా! దీనివికృతాకారముఁ గాంచుచున్న కొలఁదిని నాకు నవ్వువచ్చుచున్నయది. (అని నవ్వుచు శరప్రయోగ మాచరించును. (తాటక కూలును.)

విశ్వా—రామచంద్రా! దుష్టనాశన మ్మొనరించితివి. ఇంక సవనరక్షణార్థమై యరుగుదము పదుండు. (అని నడచి విశ్వామిత్రాశ్రమమునం దుపవిష్టులై యుండవలయును.)

(యజ్ఞవేది ఋషులు పరివేష్టించి యజ్ఞకార్యముల నిర్వర్తించుచుందురు) (తెర వాలును.)

[ప్రవేశము : రాముఁడు, మునులు, విశ్వామిత్రుడు.]

మునులు—(రామచంద్రుని సమీపించి) రామా! దుష్టనక్తంచర నాశనముఁ జేసి సవనముద్ధరించి దేవతా పితృతృప్తికరంబులగు యజ్ఞాదికంబుల నెలకొల్పు యజ్ఞఫలప్రదాతవైన పూరుషోత్తముఁడవు. ఇట్లే యాచరించుట నీవిధియని వేదంబులు బలుకుచుండును. ఇందు స్వాతిశయంబు లేదు.

విశ్వా—రామచంద్రా!

సీ॥ సమదగజాయత♦సత్త్వు మారీచుని
మారుతాస్త్రంబుచే ♦ మదమడంచి
సకలదైతేయాధి♦సమాత్రిత్సుబాహుని
కోల నొక్కట నేలఁ ♦ గూలవైచి
పరివృతదైతేయ♦బాంధవసందోహ
ముల ధనంజయశర♦మునను గాల్చి
అఖిలతాపసగణ ♦ మానంద మందఁగా
యజ్ఞము నిర్విఘ్న♦మనగ నిలిపి

తే॥ లోకముల రక్షఁజేయుని♦రూఢి మెరసి
అవతరించితి శ్రీరాముఁ ♦ డనగ భువిని;
కొమ్ము రక్షోగణంబులఁ ♦ గూల్పనైన
పృథులశస్త్రాస్త్రములు వీని ♦ ప్రియముతోడ.

(అని యొసంగును.)

రాము—(నమస్కరించి పరిగ్రహించును.)

విశ్వా—రామా! ఇచ్చటికనతిదూరమున మిథిలానగర మను పురము గలదు. అద్దాని కధినేతయగు జనకునింట నొకధనువు కలదు. ఆ ధను వెక్కిడినవారికిఁ దన కన్యారత్నము నిత్తునని పలుకుచుండెను. మన మట కరిగి చూచివత్తము.

విశ్వా—రఘుకులతిలకా!

రాము——(ఆలోచనాముఖముతో) తపోధనోత్తమా! తమ్ముం బురస్కరించుకొని యెంతటిదూరమైనను వత్తుము. అయోధ్యానగరంబునకన్నను ఈ యరణ్యాసంచారమున మా మనంబులను, తాము వచించు పూర్వచారిత్రముల వినుచు, కనుచు నున్నకొలఁదిగ ఆనంద మినుమడించుచున్నయది. చిత్తానుసరణిగ నొనరింపుఁడు.

విశ్వా——మంచిది, చనుదము రండు.

(తెర పడును)

ప్రథమాంకము సంపూర్ణము.

---

11





శ్రీ

సూర్యనారాయణపరబ్రహ్మణే నమః.

# కావ్యసిద్ధి

## ద్వితీయాంకము

రంగము : అరణ్యము.

[రామలక్ష్మణులు విశ్వామిత్రునివెనుక నడచుచుందురు]

రాము:—ఋషిచంద్రా! యివ్వనం బతిలోకరామణీయకంబుగఁ గన్పట్టుచున్నయది. ఎవ్వారియాశ్రమమో విన గోరెద.

విశ్వా—ఇవ్వనంబున పూర్వము గౌతముండను బ్రహ్మఋషిసత్తముఁడు తపమాచరించుచుండ ఇంద్రుం డతనిజాయను గికురించి భంగపరచిన నతఁ డెరిగి యింద్రునియండంబులఁ దెగిపడు నట్లును సహస్రభగధారివగు మనియు శపించి పత్నింగని శిలవై పడియుండుమనియెను. ఆమె యీమధ్య నెచ్చటనో పడియుండ నోపు.

రాము—గురువర్యా! ఆమె యెంతకాల మట్లుండవలయును? శాపనివృత్తికి మార్గంబు లేదా? (అనునంత రామునిపాదరజము సోకి శిల యహల్యయై నిలుచును.)

రామ }
లక్ష్మ } (నివ్వెరపడి ఒకరిమొగ మొకరు చూచుకొనుచుందురు.)

విశ్వా—(రామునివంకఁ జూచుచు తనలో) యీతఁడెద్దియుం దెలియని నంగనాచివలె వెర్రిచూపులు చూచుచు లోకముల భ్రమింపఁ జేయుచున్నాఁడు. ఎందులకో యీమాయ? మోసగింపవలయు ననియే యీతనియూహ. (ప్రకాశముగా) రామా! నీపాద ములపరాగమే యీ శాపనివృత్తికి మార్గము. ఈపెయే గౌత మునిభార్య; అహల్య యందురు.

అహల్య—(చేతులు జోడించి నిలిచి) రఘువంశక్షీరవారాన్నిధిరాకా సుధాకరా! ఆమ్నాయార్థముల కామ్రేడితమగు నీమూర్తికి జోహారు! సజ్జనఋషిహృదయంబుల కధ్యాహారమగు నీరూపము నకుఁ బ్రణతి.

మ॥ నిను బ్రహ్మంబ వటంచు సర్వజగతీ♦నిర్మాత వంచున్ నిరం
జననిత్యాత్మకమూర్తి వంచు చిదచి♦త్సన్మూర్తి వంచున్ మహా
ఘనుగా నిర్గుణుఁగా గుణాత్మునిగ ని♦ష్కామాత్మ్రుఁగా రాముఁగా
గను బోధించెడి శాస్త్రసంచయము లో♦కైకం డీవయై యుండినన్.

నా పూర్వజన్మ సంస్కృతపదార్థము పుంజీభవించి ప్రత్యక్షమైన విధంబున దృక్పర్వమొనరించు నతిలోకసుందరమూర్తి యగు భవదీయాకృతి నేమని కీర్తింతును? ఎట్లుగ నీమహిమలఁ దెలియ నేర్తును?

సీ॥ వేదాపహారుఁడై ♦ యుదధిని డాగుసో
మకుఁ జీల్చి మినుకుల ♦ మనుచు జనక
జగములఁ జుట్టి చా♦పగ నబ్ధి నిడు హిర
ణ్యకుఁ ద్రుంచు నా వర♦హాలతండ్రి
అబ్ధిలోఁ గ్రుంకనీ♦యక కుధరంబు కూ
ర్మంబవై యెత్తిన ♦ మాయలయ్య
మకరికిఁ జిక్కి వే♦మారు మ్రొక్కెడుకరీం
ద్రుని బ్రోచి జగముల ♦ నేలువాఁడ
తే॥ అరయ వేదార్థములకు బ♦ర్యాయ మార్గ
. . . . . . . . . . . .
చిత్రములకైయు ద్రోవశసిమయ్యైన

దివ్యమంగళరూపంబు ♦ దివిజులకు న
లభ్యమగు, చూఁడ నోఁచితి ♦ రామచంద్ర!

సర్వేశ్వరుండవై సకలచరాచర జంతుజాలంబుల సృజియింపను, బెంపను, విలయంబొనరింపను, మూలాధారుండవై కారణ కార్యాతీతుండవై ఋతు, హాయన, మాస, పక్ష, దిన, ఘటి కాదిరూపకుండవై యలరారుచు నొక్కరుండవై సహస్రశీర్షుండవగు సర్వజగద్భారవాహకుండవై ప్రకాశిలుచు నిత్యానవద్యనిరవధిక కృపాపీయూషవర్షధారాకణ పరిపోషిత భక్తచాతకుండవై విశ్వేశ్వరుండవగు లోకసంత్రాణకరణధుర్యుండవై ధర్మస్వరూపకుండవై లోకోద్ధరణకై యుగంబున కొకరూపము సంతరించుకొని నటియించుచుండు నటశిఖావతంసుఁడవగు నిన్ను అబలనై అల్పజ్ఞానాన్విత నగుదాన నేవిధి కొండాడనేర్తును ?

విశ్వా—(మందహాసముతో తనలో) రామా! యేల యిట్లు పిచ్చివానివలె చూచుచుంటివి ?

రాము—తపోధనోత్తమా! ఈపె నావంకఁ దిలకించుచు వేదార్థము లుపన్యసించుటకుఁ గారణమేమియో ? యని.

విశ్వా—రామా! ఆపె బ్రహ్మమానసపుత్రి, గౌతమునియిల్లాలు. ఆపె పలుకువాక్యములయర్థ మీవనియే యాపెనమ్మకము.

(తెరలో)

అంధకార గర్భంబునం దణగియున్న యాపెకన్నులకుఁ గనుపించిన తేజోరాశివగు నిన్నే యిట్లు పలుకుచున్నయది. ఇది నిశ్చయము. నీవు పరాత్పరాంశజనితుఁడవు. (అనుచు గౌతముఁడు ప్రవేశించును.)

రామ } (నమస్కరింతురు.)
లక్ష్మ }

గౌత—కల్యాణమగుఁగాక! రామచంద్రా! యెంతయోకాలము నాచే విడువఁబడినదై, శిలారూపధారిణియైన యీపెను భవదీయ పాదపవిత్రరజోలేశమున పునీతజీవితఁజేసి యొసంగిన నీ కరుణకేను బాత్రుండనైతిని. నేనేకాదు, చరాచరవిశేష సంయుతమగు సృష్టియంతయు, నీకరుణకుం బాత్రమనుట నిర్వివాదాంశము. అవ్యయుండవగుపురాణపురుషుండవు. అంతయు నీవ యనుట నిన్నుఁ దెలిసినవారికిఁ దెలియును. నీకు తెలిసియుండియు తెలియనిపగిదిగ అజ్ఞానాంధకారగర్భంబునం దణఁగి కన్నులు గనరారి విమోహితులచిత్తవృత్తుల మోసగింపను, మదాంధులదుష్క్రియాపరంపరల వృద్ధిజెందింపను, పిమ్మట మాయింపను, సంస్కృతరూపధారివై వర్తించుచుందువు. పాపపుణ్యంబులనియు, జ్ఞానాజ్ఞానంబులనియు, సత్యాసత్యంబులనియు, త్రైగుణ్యంబు లనియు, పరస్పరవిరుద్ధంబు లగు నెన్నియో విభేదగుణంబులఁ గల్పించి భౌతిక ప్రపంచమునకుఁ జూపితివి. వీని నన్నింటిని, నాత్మశక్తిచే నాగి, విజ్ఞానాధిగత హృదయుండై, పూర్వోక్తపదార్థంబుల దేనిని హృదయంబున కంటనీక, నిష్కామియై హృదయస్థుండవగు నీతోడిసంగం బొనరించుచు, సర్వంబును మిథ్యయని తెలిసికొని నిజహృదయంబు నొక్కచో భద్రపరచుకొని యున్నవాఁడు జగన్నాటక సూత్రధారివగు నీ చిత్రాతిచిత్రవేషంబులను, నిన్నుం గాంచి నవ్వుకొనుచుండును. అట్టివానినే నీవు ప్రేమింతువు. నీనడవడి యిట్లుండును. లోకవిద్రావణు లగు రావణాదిభీకరాసురహరణార్థమై దేవతలచే ప్రార్థింపఁబడి భూమికవతరించి, త్రిజగన్మోహనాభిరామత రాముండవన సంచరించుచుంటివి. నీచరిత్ర మట్టిది. ఇంక నే నరిగివచ్చెద.

(అహల్యాసహితుఁడై నిష్క్రమించును.)

విశ్వా—రామా! ఇంక మిథిలకుఁ జనుదము నడువుడు.

రాము—గురూత్తమా! తమయాజ్ఞయే ప్రధానమని నడచుచుంటిని.

విల్లు విరచి సీతఁ గైకొనుటకై మిథిల కరుగుటన నంత సమం జస మని నాబుద్ధికిఁ దోఁచుటలేదు.

విశ్వా—రామా! అందువలన శాశ్వతమగు కీర్తి గలుగును.

రాము—గురూత్తమా! కీర్తింగాంచుటకు మానవున కెన్నిమార్గంబు లుండవు? ఇయ్యదియే కావలయునా?

విశ్వా—అటుగాదు, సమస్తరాజన్యపరిభవకారి యగు శివువిల్లు విర చుటచే జగదేకవిక్రమత్వముఁ జాటుటయును గృహస్థాశ్రమ ధర్మసంస్థాపనార్థమై సీతఁ గైకొనుటయును దటస్థించును.

రాము—గురూత్తమా! యెందరు ఋషిసత్తము లూర్ధ్వరేతస్కులై నిశ్చలహృదయంబులో కాలముఁ గడపుచు ముక్తినందరు? వారి మార్గము నా కెందు కనుగమింపరానిది?

విశ్వా—రామచంద్రా! ధర్మసంస్థాపనార్థమై పుడమి కవతరించి యీ రూపమున వర్తించుచుండునీవే యిట్టిపథ మనుసరించుట కూడనిది. లోకమున పెద్దవాఁడాచరించునది పాఁడిగాఁ జెల్లు చుండును. "కంచెయే చేను మేసిన గతియుఁ గలదే?" అను లోకోక్తిరీతి ఈ పథము నీ వనుసరించుట లోకమునకు శరణ్యముండదు. అందునను సమస్తాశ్రమములందునను గృహ స్థాశ్రమ మత్యుత్తమము. ఇందు నీకు తెలియనిధర్మములేవి? సమస్తజీవాంతరస్థుండవగు నీవు నాచే నిట్లెందుకు చెప్పించు చుంటివో వినుచు నిట్లెందుకాడుచుంటివో నేనెట్లు తెలియఁ గలను?

రాము—(ఇంచుక నవ్వుతో) గురూత్తమా! నేనెద్దియో పలుకు టయు ప్రతిదానికి మీరిట్లు భాష్యంబులఁ గల్పించుటయు చిత్రము. దైవాంశ నాయందు కలదని మీరెట్లు నిశ్చయింతురు?

విశ్వా—సర్వోత్కృష్టబలాధికుఁడ వగుటచేత.

రాము—ఆచరితకర్మానుసరణి ప్రాప్తించు బలాధికతచే నీశ్వర తుల్యుం డగునా?

విశ్వా—కర్మ దైవస్వరూపమగుట యెఱుంగవా? యెవనికర్మ మనుకూలించునో వాఁడు దైవబలోపేతుండనుట నిర్వివాదాంశము. దైవబలాధికుం డగుటచేతనే వానికిఁ గర్మ మనుకూలించుటయు బలాధికుం డగుటయు తటస్థించును. దైవస్వరూపి కర్మయగుటయు కర్మస్వరూపి దైవమగుటయు వేదవిదితాంశము. ఆ జంటయం దవినాభావసంబంధ ముండెనని యెఱుంగునది. కావున దైవబలోపేతుండు ఈశ్వరాంశజనితుండు. అట్టి వాఁడు శాసించునది శాసనమగును. ఆతనిపలుకులు వేదములగును. వానికర్మలు సర్వజనాదరణీయము లగును. వాఁడు భావికాలమున కాదర్శపూరుషుం డగును. వానిచరితము శాస్త్ర పురాణ నాటకములుగా మారుచుండును. కాన నా వాక్యంబులఁ బాటింపుము. సత్వరమ మిథిల కరుగుదము, నడువుము.

రాము—గురూత్తమా! తమ మాట పాటించుటయే నా విధి. ఇందు నావ్యతిరేకాభిప్రాయము లేదు. విల్లువిరచుట సంతసమే. సీతఁ బరిణయమాడుటన నిచ్ఛ లేదు.

విశ్వా—(తనలో) ఈతఁ డా సుందరిం దక్క పెరకన్యలఁ దిలకించుచో నస్థలితహృదయుఁ డగుననుటకు సందియముండదు. అన్నివిధముల సీతని నాపెవలలకుఁ దవులించుటయే నాపని. ఇయ్యదియే విధాతృనాజ్ఞ. (మందహాసముతో ప్రకాశముగా) రామా! నీ వెప్పు డా యొప్పులకుప్ప యగు అపరూపసుందరాంగిఁ జూచియుండవు. చూచిన నిట్లాడవు. సీత సర్వవిధసుగుణాలవాలము, సౌందర్యముల ఖని, సృష్టి సర్వమునం దొక్కటే యగు విశేషము, త్రైలోక్యసుందరి, అమానుషస్వరూపిణి, మూర్తీభవద్భారతి, ప్రేమకు పెన్నిధానము. వేయేల? ఆ లావణ్యవతీకరగ్రహణ మొనరింపనినాఁడు నీ జన్మమే నిష్ఫలము. ఆమె నీకొరకే యుత్పన్నమైనది. చూచినపుడే హృదయంబును నాచికొనఁజాలిన సౌందర్యము. ఇప్పుడు

నా వాక్యము లతిశయోక్తులుగా చూపట్టవచ్చును. సీతఁ గాంచునపుడుమాత్రము స్వభావోక్తికైనం జాలనటులఁ దలంతువని నా యాశయము. ఆమె ప్రపంచమున కొక యాదర్శ స్వరూపము. ఆమెకరగ్రహణమాత్రమున నీయందు తేజమావిర్భవించును. ఇది సత్యము.

సీ॥ బాలేందు రేఖసం♦పద మించు ఫాలంబు
ఆణిమెరుంగుము♦త్యాలు పండ్లు
బిరుసునీలంపు టుం♦గరము లా చెలికురుల్
నిద్దంపుటద్ద మా ♦ నెలత చెక్కు
తొలికారు మెరుపులో♦పలి కాంతి దేహము
బంగారుబంతు లా ♦ పడతిచనులు
తెలిదమ్మి రేకులఁ ♦ దలిమమ్మో దృక్కులు
సింగార మానాతి♦చెలువు మొగము
తే॥ చెప్పఁగా నేల ఆ [illegible] ప్రసతి యువ..
..[illegible]వతారము రా[illegible]లక్ష్మి...
..[illegible] సృష్టి [illegible]..
..[illegible]..

రాము—గురువరా! తమ వాక్యానుసార మాపె సుందరియే కావచ్చును. ఐననేమి? యెందుల కిట్లు ప్రబోధింతురు?

విశ్వా—రామా! స్త్రీయన నేమియో యెరుంగనిపసితనంబుననుంటిమి. అయ్యది సర్వోత్కృష్టమగు పదార్థము, పూరుషకీర్తిసర్వస్వము, మానవున కుత్తేజముఁ గల్పించువస్తువిశేషము, సంసారాంధతమసంబున జనుగృహస్థునకుఁ గేలూత, గృహస్థాదిక సకలసద్ధర్మనిలయము, సర్వవిధానందములవిడుదల. అయ్యది మానవసముపార్జితకర్మపుంజప్రతిఫలితస్వరూపిణియై ప్రాప్తించుచుండును.

రాము—గురూత్తమా! మానవుండు ప్రేమవిరహిత హృదయుండై నిస్సంగుఁడుగ మోక్షార్థి కావలయుననికదా వేదవాక్యము?

విశ్వా—మోక్షశబ్దార్థము సర్వవిధగుణమోక్ష సమాచరణము నిర్గుణస్వరూప మీశ్వరతుల్యము. పరస్పర విరుద్ధగుణములు లేని రెండుసద్వస్తువులకూడిక కలిగినపుడు శోభ జనించును. అవు డీసర్వవిధగుణనిరపేక్ష యగుటయే మోక్షము. కాదనిన ఆ దారి మోక్షమునకుఁ జేర్చునది. నీచే నర్థింపఁబడు మోక్షమునకుఁ గేలూతయే సీత. నే నెందుల కిట్లు పలుకుచుంటినో తెలియుము.

సీ॥ సృష్టిలో నొక్కఁడా ♦ చిత్రింబు కళల కె
ల్లను దానకము మేలు ♦ గనెడితావు
సకలసౌజన్యాళి ♦ జాలువారెడినది
సౌఖ్యాళినెలవు భా♦వ్యములప్రోవు
అమలినహృదయస♦దానందరూపిణి
కీర్తిస్వరూప స్వ♦ర్గీయకాంత
ఆనందముల కెల♦వైనపెన్నిధి సత్య
ధర్మాదిగుణముల♦ తానకంబు
తే॥ అనఘతరము గృహస్థాశ్ర♦మాధిగతను
ధర్మ మంచితాహ్లాదమై ♦ తనరు నవని
జాత యగు సీత సద్గుణ♦ప్రోత యాపె
జతనమును బొందలేనిని♦జన్మ మేల ?

రాము—మునీంద్రా ! సీతం బెండ్లియాడుమనియే తమయాజ్ఞ. దానిని నే పాలించెద, నడువుడు.

విశ్వా—రామచంద్రా ! నాయాజ్ఞానువర్తివి కాఁజనదు. ఆపెఁగాంచు పిదప నీయిచ్చ యెట్లుండిన నట్లేచేయుము (అంత నడతురు).

(తెర పడును)

---

రంగము : మిథిలానగరమున దేవాలయము.

(దేవికెదురయి నిలిచియున్నసీతప్రవేశము)

సీత—

ఉ॥ వాతెర పల్లవాంకురము ♦ బాహులు కోమలశాఖలున్ స్మిత
వ్రాతము పుష్పగుచ్ఛములు ♦ పర్వతజాతలతాంగి వౌట త
త్ఖ్యాతిని స్థాణునిన్ గదిసి ♦ హాయి మెలంగితివమ్మ త్వత్పద
ధ్యాతల కీవె కల్పకల ♦ తా ప్రతిభన్ విలసిల్లి శాంకరీ !

దుర్గా! నీనాథుని నీవెట్లుగ వశంవదుని జేసికొంటివి ? అనురూప వరులపై సతులకుండు ప్రేమ యిట్లుండునని నీకు నేఁ జెప్పవలయునా ! దేవి! నీయానందమే నీకు కాదు, నీబిడ్డలయానందమును నీవు తిలకించి సంతసించుచుండవలయును. భక్తులయభీష్టములఁ దీర్చుకల్పవల్లివని పండితులు పల్కుచుందురు. తొల్లి సమస్తదేవతలు నిన్నారాధించి అనురూపవరులఁ బడసినటుల వినుకలియుండెను. నాయభీష్టముఁ దీర్పుము. లేకున్న నీకీబిరుద మూడిపోవును.

శా॥ పౌలోమీప్రముఖాంగనామణులు త్వ ♦ త్పాదద్వయీపద్మసే
వాలోలాభిరతిం దలిర్ప కమలా ♦ వాణీసరోజేక్షణల్
లీలాచాలనచాతురిన్ వ్యజనపా ♦ ళిన్ వీవ నీరాజనం
బాలోకింపఁగలామె లోకజననీ ♦ వ్యాలోలనీలాలకా!

(అని, యించుకతడవు వినుచున్నటుల నటియించుచు) తల్లీ! యేమందువు? నీవలచునాతండెవ్వండనియా! తెలిపెద వినుము. చిత్రఫలకసందర్శనసమయమునం దిలకించినదశరథనందనుని, దరహాసవిజితేందుసుందరవదనారవిందుని, పురందరాదిదేవకదంబ నందితమృదులపదారవిందుని, దుష్టమారణదీక్షాబద్ధకంకణుండగు శ్రీరామచంద్రునిఁ బతిగఁ బ్రసాదింపుము. 'నీకీ ప్రపంచమున శ్రీరామచంద్రునికన్నను భజించఁదగు దేవుండును, వరించఁదగు విభుండును ప్రేమించఁదగు మిత్రుండును, మ్రొక్కఁదగు

గురుండును లేఁడు లేఁడని పలుకనేల? మదీయహృద్గతదృఢాభి ప్రాయము నీకెరుకపడకెట్లుండును? తెలిసినదానిఁ దెలిసికొనఁ బనియుండదు. కాన నావరునిఁ జేర్పుమని ప్రార్థించుచుంటిని. పిదప చేయక తప్పదని శాసించుచుంటిని. వలచినవరునికన్న కాంతలకు వేరధికము గలుగ నేరదని పలుకుచుంటిని. ఈవిషయం బున నాకన్నను నీకెక్కుడనుభవముండునని యెరిఁగి యాఁడు చుంటిని. కావున నాప్రార్థన మంగీకరింపుమనుచుంటిని. అనం తమై, అనుపమానమై, అనిర్వచనీయమైన యీమదీయ హృద్గత ప్రేమభారము కన్నులు విప్పి చూడుము. ఈ నీ ప్రేమలతలకు నీరుపోసి పెంచుము. శ్రీరామచంద్రు నిటకు రప్పింపుము. నీధవువిల్లు విరచి నన్ను గైకొనునటు చేయుము.

(అంత హేమ ప్రవేశించును)

హేమ—అమ్మా! నాయన తమకై స్వయంవరసభాస్థానమున వేచి యుండి సత్వరము తోడుకొనిరమ్మనిరి. నానా దేశ రాజన్యు లరు దెంచిరి.

సీత—హేమా! శ్రీరామచంద్రుఁ డరుదెంచెనా?

హేమ—శ్రీరామచంద్రుఁడెవరు?

సీత—నీవెరుంగవా? చిత్రఫలకసందర్శనసమయమ్మునఁ దోచిన మదీ య చిత్తచోరుని.

హేమ—అమ్మా! రాజులుమాత్ర మనేకులు వచ్చియుండిరి.

సీత—రాజులమాటలేటికి? రాము నెరుంగవా?

హేమ—నాచేఁ జూడఁబడలేదు.

సీత—ఐన నారాక యెందులకు?

హేమ—స్వయంవరమునకు.

సీత—స్వయంవరపద్ధతు లందులేవు. విల్లు నెక్కిడువానినిగదా నేఁబెండ్లి యాడఁదగునది? రాముఁడె రాకున్న నింక నితరులచే నాపని జరుగునదికాదు. అయిన నడువుము, చూతము. (నడచు చుందురు.)

హేమ—అమ్మా! ఎప్పుడును జూడనిరామునిపయి నీహృదయమీగతిగ నెట్లు సక్తమయినది?

సీత—వెర్రిదానా! కన్నులనె చూడవలయునా? సృష్టినిర్మితమగు మిగిలినఇంద్రియములు లేవా? యథార్థమారయ.

తే॥ వినుకలియె ఛాయగా నేగి ♦ విమలగతిని
చని హృదీశుని గనుగొని ♦ సంతసించు
పరిమళమె జాడగా నేగి ♦ పద్మముఁ గని
దానిమకరందమున భృంగి ♦ తనియఁబడదె?

హేమ—అమ్మా! ఇది యేటిపాండిత్యము?

సీత—దానిభావము నీకిప్పుడే యెరుకపడదు, నడువుము.

(నిష్క్రమింతురు) (తెర పడును)

(స్వయంవరసభ - నానాదేశరాజన్యకుమారులచే నిండిన చెలిమికత్తియతో సౌధోపరిభాగమున పుష్పమాలికా హస్తయై నిలిచియున్న సీత)

జన—(లేచి నిలిచి) రాసుతులారా! యీ శివధనువు మాయింట పితృపైతామహంబుగా పూజితంబై యలరారుచున్నయది. పదివేవురు దృఢకాయులగు మల్లురచేఁగాని జరుప శక్యము కాని ఈ మహాధనువు నొక్కనాఁడు స్వయంవరలబ్ధగానున్న సీతాభిధాన యగు మత్కుమారీమణి కందుకక్రీడా లగ్న మానసయై యాడుచో కందుకము శివధనువున కధోభాగమునఁ బడిన నశ్రమంబున నీధనువును గదలించి కందుకముఁగొని యథాగతి ఖేలనాసక్తయై చనుబాలికఁ గాంచి మహత్తరవీర్య కలితయగునీపెకనుకూలవరుం డెందు కలుగునా? యని విచారించి కొట్టకొనకు సహజవీర్యోద్ఘాటన శివధను వగు నీమెను వీర్యశుల్కగా నిశ్చయించి యీ గతిగ వెల్లడింపఁ బడియెను. కావున మీ మీ యోపికకొలందుల నీ ధనువు నెక్కిడఁ దొడఁగుడు. వింట నారిగూర్చినవారి కీకన్యామణినిచ్చి పరిణయ మాచరింతును.

(రాజులు వరుసవరుసలుగా శివువింటిఁ జేరి యెక్కిడఁజాలక వెనుదిరిగి వచ్చుచుందురు.)

[అంత రామలక్ష్మణసహితుఁడగు విశ్వామిత్రుఁడు ప్రవేశించును.]

జన—(ఎదురేగి అర్ఘ్యాసనాసీనులఁ జేయును.)

సీత—(దెసలఁ బరికించుచు) చెలీ! ఇదేమి వింత? ఆకాశము నీలనీరదావృతము కాలేదే! క్రమక్రమంబుగ త్రిజగన్మోహనాభిరామం బగు నీ కోమల శ్యామలకాంతిపుంజ మెచ్చటనుండి సముద్భవంబై దెస లాక్రమించుచున్నయది?

తే॥ కడు విచిత్రంబులై మేఘ ♦ కాంతితోడ
స్పర్థనూనెడు మేచక ♦ జలనుపూర
కృష్ణతరఁగలట్లేలోకో ♦ రేగి యస్మ
దుపరిసౌధంబుపై కి రా ♦ నుద్యమించె.

(అని ముందుకుఁ జూచి) (తనలో) ఓహో! ఈ యద్వితీయ లోకోత్తర యువకద్వయ మెవ్వారో? వీరి శరీరకాంతులె యిట్లు ప్రసరించుచుండవచ్చును.

రాము—(సీతదెస క్రీగంటఁ జూచుచు తనలో) ఈ పూమాలిక ధరించియున్నయాపెయే సీత. ఈపెసౌందర్యము మనోరంజకము కాదనుటకు వీలులేదు. సానదీర్చిన జాతిరత్నము. మునీంద్రునివాక్యములయం దొక్కటియుఁ బొల్లు లేదు. పొల్లు లేకుండె నననేల? స్వభావోక్తికైనఁ జాలవు.

తే॥ దేవతాకాంతలైన నీ ♦ తీవబోడి
చరణనఖరేఖ కేనియుఁ ♦ జాలకుండ
ప్రకృతిసౌందర్యసత్కళల్ ♦ పదిలపరచి
అతిశయితలోకకాంతగా ♦ నజుఁడు దీర్చె.

జన—మునీంద్రా! సుమ సుకుమార శరీరులగు నీ రాకుమారు లెవ్వారి తనయులు?

సీత—(రామునిదెస క్రీగంటఁజూచుచు) ఈతఁడెవ్వఁడో కాని నాహృదయము నాకర్షించుచున్నాఁడు. చిత్రపటసందర్శనసమయమునఁ దిలకించినరాముం డీతఁడే యని తోఁచుచున్నయది. తండ్రి ప్రశ్నమున కీమునిచంద్రుఁ డేమని చెప్పునో వినియెద.

విశ్వా—(సీతారాములవంకఁ జూచుచు తనలో) ఓహో! వీరల యొండొరులదృష్టివినిర్గతంబు లగు విద్యుల్లతికలు గాఢంబుగాఁ బెనఁగొనుచున్నయవి. ఇంక నాయత్నము సిద్ధించును. (ప్రకాశముగా) జనకా! సూర్యవంశోద్భవుండగు దశరథుని తనయులు, రామలక్ష్మణు లందురు.

సీత—(రామునివంకఁజూచుచు) (తనలో) భళి! యెంతటియదృష్టము! నేఁ దలంచినట్లితఁడు రాముండఁట! రోయుతీగ కాలికిఁ జుట్టుకొనె నన్నట్లు జరిగినది. ఈతనియాకారాదులం బట్టి చూడ వింటి నెక్కిడ సమర్థుఁడనియె తోఁచెడిని. ఇట్టి నియమములఁ గల్పించుటచేతనే రాముని బోలిన సుందరమూర్తి నాకట్టెదుటఁ బ్రత్యక్షమయ్యె. (అని రామునివంక క్రీగంటఁ జూచుచు ఓహో! నన్నితఁడు క్రీగంటఁ జూచుచున్నాఁడు.)

తే॥ ఓరచూపులలో భావ ♦ మొప్పు నేదో
ఏదో యన నేల నన్ దిల♦కించుచుండె
అస్మదీయకటాక్షము ♦ లతనిపైన
సోకుతోడనె నను జూచు, ♦ చోద్యమయ్యె.

జన—మునీంద్రా! వీరి నెటకుఁ గొని చనుచుండిరి?

విశ్వా—దశరథునిపనుపున దుష్టాసురహరణమొనరించి నీయింటఁగల శివధనువుఁ జూడ బరతెంచెను.

జన—(తనలో) ఔరా! ఈతనియందముఁ జూచిన నాకె చిత్తవిభ్రమము గల్గుచున్నయది. వీరు దశరథకుమారు లను నమ్మకము నాకు పొడకట్టుటలేదు. మిషచే మదీయ హృదయపరీక్షార్థమై

ఈ మునిచంద్రుని వెనుకనిడుకొని పరతెంచిన దేవేశ్వరుం డని నా మనమునకు పొడముచున్నయది. తుద కేది యెట్లు జరుగ నున్నదో నేనెట్లు తెలియఁగలుగుదును? పరమతపోనిధియగు నీమునిచంద్రుం డెట్లసత్యమాడును? యుక్తాయుక్త వివేక శూన్యులు కార్యసిద్ధి నందనేర రని పలుకు వేదఘోష మెట్ల సత్యమగును? ధనువెక్కిడినవానికే మదీయకన్యారత్నము నిత్తునని పలికిన నావాక్యము లసత్యంబు లగునని తోఁచెడిని. సర్వజగ దారాధ్యునిఁ బలెఁ జూపట్టు రామచంద్రునకు నా కన్యక నిచ్చి వైవాహికం బొనరించు భాగ్యము నాకు కలుగునని తోఁపదు. ఒకవేళ తెంపరినై చేతునా! అసత్యదోషము ప్రాప్తించునట్లు కన్పట్టుచున్నది. దైవ మెట్లు చేయనున్నదో? (అనుకొను చుండ)

విశ్వా—(శివధనువుకడ కరిగి) రామా! యీ శివధనువు పరీక్షింపుము.

రాము—మంచిది. (అని సమీపించి శివధనువువంక నీరసముగఁ జూచును.)

విశ్వా—రామా! నీ వీ ధనువు నశ్రమంబున మోపెట్టఁగలవని నా నమ్మకము.

రాము—గురూత్తమా! మహామునీంద్రుల యాత్మవిశ్వాసంబు లనిరుద్ధంబులని నాతలంపు. (అని సీతవంకఁ జూచుచు) అబ్బా! యీ సోయగము దిలకించినకొలందిగ మదీయ హృదయంబు చూరగొనఁబడుచున్నయది.

తే॥ లలితసంస్తవనీయవిలాసప్రావృ
షేణ్యనీలజీమూతవిశేషలక్ష్మ
బంధితంబైన తత్కేశబంధమందె
ముడిచె నస్మదీయహృదబ్జమును రవంత.

విశ్వా—రామా! యీ ధనువు మోపెట్టుము.

రాము—ఆశీరవశిష్టము. (అని నమస్కరించును.)

విశ్వా—

తే॥ ధర్మదేవత దైవమ్ము ♦ ధరణి సత్య
మార్గవర్తులయెడ నెందు ♦ మనునయేని
బ్రహ్మఋషివాక్య మిలను సం♦భావ్యమేని
జయముఁ గను రామ! రవికుల♦సార్వభౌమ.

రాము—(సీతవంకఁ జూచుచు తనలో)

తే॥ ఆ యువతికన్నుగొనలయం♦దధివసించు
మారుఁడూరక గురిచూచి ♦ మానసమ్ము
వ్రియ్యగా నేసె వింటిని ♦ వ్రిక్కలించి
మరునిగర్వమ్మడంతు స♦మ్మద మెలర్ప.

(అని శివధనువును సమీపించును.)

విశ్వా—(రామునివంకఁజూచి ఆశ్చర్యమభినయించుచు) ఎంతలో నెట్లు మారినయది! యీమూర్తి. పాలుకారుచుండనగు సీతని నగు మొగము, అచ్చోఁమ్మమెయిఁగలుగు నుత్సాహాతిరేకగర్భిత మగు క్రోధవశమ్మున మూర్తీభవజ్జగత్త్రియైక విలయకార ణావిర్భూతగిరీశాననం బనఁ బ్రకాశిలుచున్నయది. అధిక రోషకషాయిత మగు సీతనియాననమ్ముఁ దిలకించుచో, శివధనువన నేల? ఫాలాక్షునినేత్రానలం బేనియు నిర్వీర్యమై, నిస్తేజమగు ననుటలో సందియముండదు.

సీత—(తనలో) నాయదృష్టమెట్లున్నదో తెలియదు. ఈరామచంద్రునిపై లగ్నమైన మదీయహృదయము తిరుగుపిధి గన్పింపదు. ఏమి యొనర్తును?

తే॥ ఆమదనమోహనాంగుని♦యందమందె
స్తంభితంబైన మన్మాన♦సంపుముకుర
మైక్యభావిమై తన్మూర్తి ♦ నధిగమించె
ఆప్రణయభావసమ్ముగ్ధ♦నైతి నేను.

రాము—(శివధను వెక్కిడి భగ్న మొనరించును.)

సీత—(సిగ్గున శిరము వంచుకొని మెల్లనఁ బర తెంచి చిరునగు మొగముతో క్రీగంటఁ జూచుచు రాముని గళమున పూలమాలిక వేయును.) విశ్రమించును

రాము—(సిగ్గుతో శిరము వంచి సీత దెస క్రీగంటఁజూచుచు తలవంచి) (తనలో)

తే॥ ఆయొయ్యారిచూపులలోన ♦ నలరుతావిస
మది గనినబాది నామది ♦ యడలుచుండె
కరకుచూపులలో లేని ♦ పరుసదనము
కలికిచూపులలో నెట్లు ♦ గలిసె భళిరె.

విశ్వా—రామా! నీ ప్రయాసమునకు ప్రతిఫలముగ కటాక్షవీక్షణోపేతమగుపూలమాలిక హృదయపరిగ్రహణ మొనరించెను. సంతసింపుము.

సీత—(తనలో) ఏమి యీమానీంద్రునివాక్యమత్కృతి!

రాము—మునీంద్రా! అంతయుఁ దమకరుణాప్రాప్తంబు. ఇందు మత్కృత మిసుమంతయు లేదు. కరుణింపు. (అని నమస్కరించును)

విశ్వా—(రాము నెత్తి కౌగిలించుకొని ఆనందబాష్పపూరితనేత్రుఁడై) ఇప్పుడు నాయొనర్చుతపంబు ఫలించినది. నాజన్మ చరితార్థమందినది. నాజీవితము సర్వోత్కృష్టమైనది. ఇంక నాకీజీవితమున కొరత యనునది లేదు.

జన—(తనలో) ఇదియంతయు నేదియో దేవరహస్యముగఁ గనుపట్టుచున్నది. ఈ రాముని సౌజన్యము వర్ణనాతీతము.

(అంత వసిష్ఠుఁడు ప్రవేశించును)

వసి—ఓహో విశ్వామిత్రుం డెంతటిధన్యుఁడయ్యెను! ఈతనిజీవితము పునీతమైనది. వీరియానందమునకు మేర లేదు.

జన—(ఎదుర్కొని నమస్కరించి ఆసనాసీనుం జేయును.)

రాము—(వసిష్ఠునకు నమస్కరించును.)

వసి—రామా! దేహస్పర్శ కరస్పర్శ సందర్శనాదివిధులచే నెందరిఁ బునీతులఁ జేయుచుంటివి! ఇట్లే సర్వజీవులఁ బునీతులఁ జేయుము. మే మందరము నీకై వేచియున్నవారమే. (అని జనకునిదిక్కు మొగంబై) జనకా! నీ వంపినవార్త ఇప్పటికి దశరథునకుం దెలిసి సపరివారంబుగా నరుదెంచుచుండును. వైవాహిక ప్రయత్న మొనర్పుఁడు.

జన—(ఆనందముతో) ధన్యోఽస్మి.

(అంత తెర పడును.)

ద్వితీయాంకము సంపూర్ణము.



శ్రీ

సూర్యనారాయణపరబ్రహ్మణే నమః.

# కావ్యసిద్ధి

## తృతీయాంకము

(ప్రవేశము దశరథుఁడు, వసిష్ఠాదిమౌనులు, పౌరులు బలసియున్న కొలువుకూటము)

దశ—(వసిష్ఠు నుపలక్షించుచు) మునీంద్రులారా! సభాంగణస్థిత సామంతపౌరజనచమూనేతలారా! ముదుకఁడనై భోగాదికకాంక్షలడుగంట, జరాభారమున వడఁకుశరీరముఁగల యీతరుణమునఁ గుమారులచే రాజ్యరక్షణముఁ జేయించుచు, నీశ్వరారాధనమునఁ గాలముఁ గడపుతరుణ మాసన్నమాయెను. రాజ్యపాలన మనిన నెదకు భారముగఁ గనుపట్టుచున్నయది. తరుణవయస్కుండగు శ్రీరామచంద్రుని రాజుఁజేయుతలపు వొడమెను.

ఉ॥ తాటకఁ గూల్చె గౌతముని♦దారకు సంసృతిగూర్చె నీశువిల్
గోటను మీటె భార్గవున♦కుంఠితవీర్యము మొక్కవోపగా
పోటమిఁ జూపెఁ దాశరథిఁ ♦ బోలి గుణంబులఁ బెద్ద లేఁడన
న్నాటె దిగంతజాలముల ♦ జానకినాథు నొనర్తు నేతగాన్.

పౌరులు— ప్రభూ! అదియే సర్వదా మాయభీష్టము.

దశ—(వసిష్ఠునిఁ జూచి) బ్రహ్మఋషిసత్తమా! సుముహూర్తము నిశ్చయింపుఁడు.

వసి—(కొంచెమాలోచించి) రాజా! ఎల్లి సూర్యోదయాత్పూర్వముననే అభిషేకసముచితసుముహూర్తమొండు కలదు. కానిచో నిట్టి లగ్న మింకొండు గలుగదు.

దశ—(కొంచె మాలోచించుచుండవలయును.)

వసి—దశరథా! యేమట్టులాలోచింతువు?

దశ—(తనలో) అమంగళము శాంతించుఁగాక! బ్రహ్మఋషివాక్యము లేలనో అశ్లీలములఁ దలచూపెడిని. (ప్రకాశముగా) మునిచంద్రా! వేరొండెద్దియుఁ గనుపింపదు. భరతశత్రుఘ్నులు గృహంబునలేమికై చింతించుచుంటిని.

వసి— దశరథా! తడవులేమిఁజేసి కేకయపృథివీపతినగరంబున నున్న భరతశత్రుఘ్నులు శుభముహూర్తమునకు రాఁజాలరు. కార్యమునకై యత్నింపుము. దీన నీకు శుభమగును. లోకోపకారముఁ గూర్చినవాఁడవగుదువు.

దశ— (సుమంతు నుపలక్షించి) సుమంతా! శ్రీరామపట్టాభిషేక మహోత్సవంబగుట పురము సింగారించునదిగఁ జాటఁబంచునది. కార్యమంతయు నీ భుజస్కంధంబుపై మోపఁబడియుండెను. పరికరము లొడఁగూర్చునది.

సుమం—చిత్తము, తమయాజ్ఞానుసారము సర్వము నిర్వర్తింతును.

దశ—మంచిది, నేఁటికిఁ గొలువు చాలింతము. (తెర పడును.)

---

రంగము : అయోధ్యాపురమున నొకవీథి, వేకువజాము.

(మంథరప్రవేశము)

(వీథిఁ బ్రవేశించి అటునిటు పరిభ్రాంతయై చూచుచు) ఏమిది? ఇది మునుపటియయోధ్యయేనా? లేక స్వప్నమునఁ గాంచుచుంటినా? నేఁడు పూర్ణిమకాదే? యీచంద్రిక లేమి? (కన్నులు నులిమికొని బాగుగా దెసలఁబరికించి చూచి) ఓహో! పట్టణ మంతయును ఎక్కడఁజూచినను లెక్కకు మిక్కిలిగఁ గనుపట్టు

వరదములకిరకిర లేమి? యీ గజతండములఘుణఘుణ లేమి? యీ పతాకములధళధళ లేమి? యీ హయసమూహంబుల హేషితములేమి? యీ త్రాగుడులేమి? యీ సాములేమి? యీ గరిడీలేమి? యీ గంతులేమి? మీ చిందులేమి? కొంపలు దగులఁబడి పోవుచున్నటు లీ దీపములవెలుతురులేమి? పట్టణ మంతయు గంధకస్తూరికాది పరిమళములచే నెగిరిపోవుచున్న దియే. యిదియంతయు నేమయియుండునబ్బా! (ఆలోచించి) ఓహో! ఔను, ఇయ్యది శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవము కావచ్చును. (అని తలపంకించుచు) అందులకే కాఁబోలు! కౌసల్యదాసి మొన్న నన్నుఁజూచి పరిహసించుచు కొంచెము వ్యత్యాసముగా మాటలాడినది. ఎందులకా యీ యుబ్బులు, ఈ మిట్టిపాటులు? అని నేనప్పుడే యాలోచించితిని కాని అంతుబట్టదాయెను. సరే, ఇప్పటికిమాత్రము మించిన దేమి? దీనికేదియేని యొకతెరగున విఘ్నమాలోచింపవలయును. లేనిచో శ్రీరామచంద్రుఁడు రాజగుటయు కౌసల్యకడనుండు దేబెమొగమువాండ్రందరు తుళ్లిపడుచు ఇదివరకు నాచే ఒనర్పంబడిన పరాభవమునకుఁ దగు ప్రతిక్రియ నాచరించుటయు అయ్యది కని యనుభవించుచు నేను బ్రతుకుటయునా? ఔరా! నాయెదుట కన్నెత్తిచూచుటకు నోరెత్తి మాటాడుటకు, పన్నువిప్పి నవ్వుటకు, వడివడిగ నడచుటకు నోచనికౌసల్యబానిస లిపుఁడు, కండకావరముచే తమ రాణి కొమరుఁడు రాజయ్యెనని నన్నొక గడ్డిపరకఁగాఁ జూడక మానరు. అట్లు వారు చేయునపుడు నాకన్నులు కనఁజాలవు. నాయొడలు మండకనిలువఁజాలదు. అప్పట్టున నానోరు తెరువక యుండఁజాలను. అట్టిచో పదుగురు ననుఁగని పరిహసింపకమానరు. కొండకెదిరి వాపోయినకుక్కంబలె నారోదనము వ్యర్థమగును. దానికన్నను మున్ముందు శ్రీరామపట్టాభిషేక కల్పవృక్షాంకూరమును బెరుఁగనీయక మూలమట్టముగఁ గూకటివేళ్లతో పెరికి పారవేయవలయును. ఇట్లేఁ జేయకున్నచో నాపేరు

మంథరకాదు. కానిచో ప్రపంచమున నేను లేనట్లేయగును. ఆపాడుకైకకు శ్రీరాముఁడు దేవుండని యెంతయో నమ్మకము. ఆకారణమున రామునిపై ప్రేమ గలిగియుండును. ఎట్లైని నాపె మనమున నీర్ష్యాగ్ని రవులుకొననిదే, నాకార్యము చక్కబడదు. ఎంతచెప్పిన నాపాడుబుద్ధి కొక్కపెట్టున నెక్కదు. ఏమి చేయవలయునో తోచదు. (ఇంచుకవడి నాలోచించి) ఆఁ మంచిది, ఇట్లే చేయువలయును. ఎట్లైని నాపెకు సవతిపై నీర్ష్యసంధించెద. ఆమెకు కౌసల్యవలనియీర్ష్యమెండు. నాశక్తి యున్నంతకు అబద్ధము లని భయపడక పాపభీతి లేక దైవ చింతన వీడి నిర్భీతిగ నిశ్శంకగ కొండెములు పలికి రాముని పదభ్రష్టునిఁ జేసెద. పండుగనాఁడైనను పాలునకు రాగి కాని యొసఁగని పాపాత్మురా లగు కౌసల్యమ్మకడుపునఁ బుట్టియు రాముఁడు తాను రాజెట్లౌనో చూచెద. ఇంక నేనాలసింపఁగూడదు. కైకమ్మకీరసమెక్కించవలయును. ఇట్లే యొనరించి నాకార్యమును పూర్తిచేసికొనియెదను. కసిదీర కౌసల్యమ్మదాసీలపై నినుమడిగ నా ప్రభుత్వముఁ జెల్లించుకొనుచుందును. ఇంతకు మంచిదారి లేదు. (అని నిష్క్రమించును)

---

రంగము : అంతఃపుర సౌధము.

(నిద్రించుచున్న కైక — మంథరప్రవేశము)

మంథ—(ఆతురయై ప్రవేశించి) కైకమూఁపుఁదట్టుచు అమ్మా! కైకా!

శా॥ కైకా యెంతటిమందబుద్ధివె యిసీ! ♦ కాంతుండు శ్రీరామునిన్
లోకైకప్రభుఁ గాఁగఁ జేసెడి నిఁకన్ ♦ లోలాక్షి కౌసల్య య
స్తోకప్రక్రియ కార్యభాగముల కు♦ద్యోగింపఁగా నీచమా
నీకీజీవిత మేల చావక వనిన్ ♦ నింద్యంబుగా సుందరీ!

కైక—(నిద్రనుండి తుళ్ళిపడి లేచి) ఏమి మంథరా! యేమట్లాక్రోశించుచుంటివి? యెవరైనదుర్మార్గులు నిన్ను బాధించిరా? సత్వరమ్ముగఁ దెలుపుము. వారల శిక్షింపఁజేసెద.

మంథ—అమ్మా! నా కెట్టియిక్కట్టులును ప్రాప్తింపలేదు. పిన్నతనమునుండి గారాబమ్ముగఁ గాపాడునీకు కష్టములు గలుగుట నాకు దుఃఖము గలిగినది.

కైక—(ఆతురతతో) ఏమి మంథరా! యేమి? నాకే! కష్టమే! ఐన సత్వరమ్ముగఁ బలుకుము.

మంథ—(పూర్వోక్తపద్యమును క్రమముగఁ బఠింపవలయును.)

కైక—(అదరిపడి మంథరనోరు మూసి) మంథరా! యెప్పుడును ఇట్టి సంగతులఁ బ్రేలకుము. ఈవిషయంబున నిట్లే పలుకుచుండిన క్షమింపఁబడవు. ఇది నీకు తగనిమాట. నా కసూయలేనివిషయము కావున నింతటి పరుసంబుగాఁ బలుకవలసివచ్చెను. ఇంక నీవీవిషయంబున నోరెత్తకుము. ఎంతటిమూర్ఖవు! ఎట్లు పలికితివి! భక్తమానససరోజభాస్కరుం డగు శ్రీరామచంద్రుని, సకలమునిజనహృదయఫలక ప్రతిఫలితరూపుండగు శ్రీ రామచంద్రుని, సృష్టి స్థితి లయాది కారణకార్యాతీతుం డగు శ్రీ రామచంద్రుని, సకలసుపర్వమస్తకన్యస్త మకుటమణిమరీచికా ప్రతిఫలిత పాదారవిందుండగు శ్రీరామచంద్రుని... నేనా...? అడవి కే... అనుపుట... పిదప బ్రతుకుటయా? యిది పొసఁగునా? మంథరా! రాముండు సర్వసముఁడు. అతఁడు తనతల్లికన్నను నన్నెక్కుడుగ మన్నించును. కాన, నట్లు పలుకకుము. అనఁదగనిమాట మన్నించితిని.

మంథ—కైకా! యెంతటిపిచ్చిదానవు?

తే॥ ఎరికి స్సిరి కల్గిన ♦ వారె యనుభ
వింతు రనుమాట తథ్యము ♦ కాంత! నేఁడు
రామచంద్రుని పట్టాభి♦రాముఁ జేయఁ
దలఁచె రేఁ డింక నేమని ♦ పలుకఁగలము.

రామునిపయిని నీకు విశ్వాసముండిన రాజ్యసర్వస్వముగ నీ వందిన సర్వసంపదలు నీ వంద్దుపై హాయిగఁ గూర్చుండనిడి కుడువఁ

బెట్టుము. అప్పుడు రామునియందు నీకు ప్రేమ కలదని సర్వ జనులు భావింతురు. జ్యేష్ఠానుక్రమముగా రామునిఁ జెందిన రాజ్యము నెడ నీవుపకరించినటు లెవ్వరును దలంపరు. రాజైన రామునిపై దయగల్గి నీవిచ్చునదియుండదు. ఏమి? దయగల్గిన పు డిచ్చుటకును పోషించుటకును అనువగు రాజ్యము, కరముననం దుంచుకొని రామునిపై దయజూపుము. ధన మున్నయెడ కెల్లబందుగులు చేరుదురు. అపుడు ప్రజలు నిన్ను శ్లాఘింతురు.

కైక—మంథరా! నీబుద్ధి పుడకలతోఁ గలసినట్లేయున్నయది. వంశానుసారంబుగ జ్యేష్ఠుండగు రాముని జెందనున్న రాజ్యరమను నేను జెందినపదంపడి నాచే పోషింపఁబడుటకు రాముఁ డంతటియనద గాదు. అనివార్యముగ రాముఁడు వనులనే చేరును. ఇట్లు చేయుట లోకులచే శ్లాఘింపఁబడుటకాదు. విరుద్ధము వాటిల్లును.

అంతియకాక—

తే॥ భరతునకు రామున కభేద ♦ భావ మరయ
  వినిన క్రోధియై గర్హించు ♦ వేడ్కపడఁడు
  కన్నకొడుకేని తోషముఁ ♦ గాంచలేని
  కార్య మేలనె మంథరా! ♦ కాదు సేయ.

తానొనరించుపని యేరికైన సంతోషకారిగఁ గనుపట్టవలయును. అట్లు కానినాఁడు ప్రజలసూయాబుద్ధితోఁ జూతురు. రామునివనవాస గమనానంతరము పాలించుటకు శేషించునది పురంబున నెద్దియుం గలుగదు. కాన నింక నిట్టిమాటలఁ జెప్పకుము.

మంథ—ఓసి పిచ్చిదానా! రాముఁ డరణ్యమునకుం జనునని నీవింతగ నాలోచింపఁజనదు. వెర్రివేడలమా! భగవదంశజనితుఁడగు రాముని యందునీకుఁగల భక్తిప్రపత్తులు నాకుమాత్రములేవా? సర్వేశ్వరాంశజుండగు రాముఁ డెచటనుండిన నేమికొదువ? అది యటుంచుము. రాజ్యకాంక్ష నీసుతునకుండుట యొకలెక్కగాదు. వులలో ముక్కుమూసికొని జపముఁజేయు తపసులకైన రాజ్య

మిత్తుననిన వద్దనరు. రామునెదుట పరిగ్రహించుటకై ఒల్ల
కుండవచ్చును కాని రాజ్యకాంక్ష లేదన వీలులేదు. ఒకపుడు
మననాయనయందా భావమును నేఁగనుగొంటిని. అందులకై
యాలోచింపఁబనిలేదు. కాని నీసవతిమిట్టిపాటు విని కని సహిం
పక యిటులాడుచుంటిని. కౌసల్యవిర్రవీగుట కంతులేదు. ఆమె
బానిసలమాట చెప్పనలవిగాదు. రాముని రాజ్యాభిషిక్తుంజేయ
నిశ్చయించుకోలేదు. అప్పుడే కత్తిగట్టుటకు యత్నించుచుండిరి.
నీకు తెలియదు. వారలకుతంత్రములు చెప్పుటకు వీలుగాని
దారులలోఁ దిరుగుచున్నవి. వారలయాశాసముద్రంబులు
ప్రపంచములనొక్కగుక్కగొనఁబర తెంచుచున్నయవి. వారల
మాయలు లోకుల కనులమూయ యత్నించుచున్నవి. వలదని
యెంతయోపికపట్టినను తిన్నవిశ్వాసమున చెప్పకతప్పినదిగాదు.
అదిగో ఆమాటనిన అప్పుడే నాయొడలు భగ్గున మండిపోవు
చున్నది. మత్తుగూడఁ గల్గుచున్నదే. ఆఁ ఆఁ (అని కంపించుచు
కూలఁబడును).

కైక—మంథరా! యేమట్లు భయపడుదువు? కైకకడనుండు ప్రియసఖ
వను మాట మరచితివా? (అని వీపు చరచుచు) నీ కేమియు
భయము లేదు. కలమాట వచింపుము.

మంథ—(భయభ్రాంతవలె నటించుచు వణకుచు) కౌసల్యమ్మదాసీ
లిట లేరుగదా?

కైక—(తనలో) ఓహో! యీపె వారలదుస్తంత్రములఁగని మిగుల
భయముచే ప్రకంపితమైపోయినది. సరి, యిందేదియో విలువ
యగు రహస్యముకలదు. (ప్రకాశముగా) మంథరా! యెవ్వరును
లేరు. నీ కేమియు భయములేదు. సత్వరముగ సత్యము
వచింపుము.

మంథ—అమ్మా! యేమివచింతును? రాముని రాజుఁజేయ నిశ్చయిం
చిరో లేదో! మొన్నటికౌసల్యదాసి నన్నుఁజూచి పరిహసించుచు,
దొప్పకడుపనియు, దోనెచెవులనియు, మిట్టగుడ్లనియు, గూని

నడుమనియు, వెక్కిరించుచు ఓసీ! గూనిముండా! రాముఁడు రాజైన పదపడి మీఁగతులు చూతములే! మేమిదివరకే మా దేవిగారితో కూడఁబలికికొనియుంటిమి. మీరు మీ దేవేరి గారితోఁగలసి మమ్ముఁ బెట్టినపాట్లన్నిటికిఁ బ్రతిక్రియ కలుగక పోదు. మేము మరువలేదు. మర చెదమని తలంచినను స్మృతికి నభినయించుచున్నవట! యింకేమి చెప్పవలయునమ్మా!

కైక—అమ్మయ్యో! కోపమునిగెనుగదా మంథరా! యెంతటిమదము! కౌసల్యతో వారలాలోచింపకయే యింతమాట? కేవలము దాసి యీగతిగ నిరసించిపలుకునా? అది యెక్కడిమాట? మంథరా! యింతలోననే నాసవతి యింతగ మదింపవలయునా? ఓసీ! అల్పబుద్ధీ! "యెగయుట పడుటకే" అనునార్యోక్తిని వినమా? సరి, కానిమ్ము. మించినదిలేదు. మంథరా! దీనికెద్దియైనఁ బ్రతిక్రియ నాలోచింపుము. దీని మదమడంతును.

మంథ—(తనలో) అమ్మయ్య! యెట్లేని కష్టములు గట్టెక్కినవి. నాయాలోచనలిప్పటికి తుదముట్టినవి. యీపె నాకరమున నున్నపుడు నాచేఁ బొనర్పఁబడరానికార్య ముండునా? ప్రపంచముల తారుమారుచేయఁగలను. అర్ధనిమేషమున సమస్తరాజ్యము భస్మముఁ జేయఁగలను. ఇపుడు నాచేతఁగాని దేది? ప్రస్తుతము రాజునకురి వోసి ప్రాణములతోఁ బాటు రాజ్యమూడఁ బెరికెదను. (ప్రకాశముగా) ప్రతిక్రియ యందు వేమి? పిచ్చిమొగము! నే నెప్పుడు నీమేలు కోరుచుండుదాననగుటచే నివియన్నియు నిదివరకే కూడఁబలికియుంచితిని. దేబెమొగముగ దాదినీవలెఁ గన్నులు మూసికొనియున్న రాణికోంప మునుఁగనలసిన దే...చెప్పెద వినుము...దేవాసురసంగ్రామమున తొల్లి నీవరుఁడు నీ కొసఁగిన వరములు రెండును నేఁ డొసఁగుమనుము. వానిలో రాముని పదునాల్గువత్సరములు సీతతో నరణ్యంబున కనుచుటయు భరతునికి రాజ్యంబొసంగుటయుఁగా కోరుము.

కైక—బ్రతికించితివిగదా మంథరా! మంచిదారిఁ జూపితివి కాని

తోఁచనికారణమున ప్రశ్నించుచుంటిని. భరతుని రాజుఁజేయ పాటుపడుమంటివి. మంచిదే! కాని రాముని నరణ్యమున కేల పనుపవలయునో గ్రహింపఁజాలనైతిని. యేదియైన కారణ ముండునా?

మంథ—అమ్మా! నీవు కేవలము వెర్రివెంకమ్మవు. చెప్పెద వినుము. శ్రీరామచంద్రుఁడు పురంబున నున్నంతవరకు ప్రజలు భరతుని ప్రేమింపరు...రాజు రామునిఁజూచుచు భరతుని పట్టభద్రునిఁ జేయఁజాలఁడు. దొంగబాపలు, టక్కరిమునులు రామచంద్రుఁ డుండ భరతుని పట్టభద్రునిఁజేయ విశ్వసింపరు. భరతుండును రామునిఁజూచుచు పట్టాభిషిక్తుఁడు కానొల్లఁడు. యథార్థమున రాముని తేజముముందు భరతుఁడు మరుగువడును......కావున నిన్నివిధముల రాముని వనవాసమునకనుచుట ముఖ్యము. భరత రాజ్యప్రాప్తికి ప్రధానకార్యక్రమమే రామునివనవాసము.

కైక—మంచిది మంథరా! ఇంక నీవేగుము...(మంథర నిర్గమించును.)

(ప్రవేశము అలుకగృహమునన్న కైక)

కైక—ఓసీ కౌసల్యా! యెంతమాయలాఁడివే? నాకుఁ దెలియనీయక యెంతలేసిమాయలఁబన్నుచుంటివి! ఇంక నొకగడియదాటినచో కాలచక్రముపై నిర్వక్రముగ నీయాజ్ఞఁ జెల్లించుచుందువు. కాని పాపమామంథర నాకై...యెంతయో కష్టపడి రహస్యభేదన మొనరించి దానికిఁ దగువికృతి నాలోచించి నా కెరిగించి నాహృదయాంధకారమున విజ్ఞానజ్యోతి వెలిగించినది. నావిమూఢహృదయంబునకు ధర్మపథంబుఁ జూపినది. రామునిపై నాకుఁగల ప్రేమస్వరూపలతికలను ఆత్మబోధనాలవిత్రముచే విచ్ఛేదనముఁ జేయించినది. సకలకులాచలమస్తకన్యస్త సముద్రవేలావలయిత నిఖిలధరావలయంబును మదీయకరగతాణుసహస్రాంశంబుఁగా నొనర్చునది...కోసలరాజతనయా! త్వదీయకుతంత్ర ప్రయోగంబుల భేదింపను మదీయ మందబుద్ధికు త్తేజముఁగల్పింపను మంత్రింబలె మంథరయుండెను. ఆమెమేధాజంఝానిలంబునకు

మదీయ సౌందర్యకాలాగ్ని తోడయి పెచ్చుపెరిఁగి వీచుచున్నయది. త్వదీయహృదయనిర్మితంబులగు గగనసౌధంబులు కూలి పోవుచున్నవి...నీహృదయవిశ్వాస కులాచలంబులు క్రుంగి పోవుచున్నవి. యుష్మదీయమనస్థితమగు ప్రేమప్రపంచము తారుమారగుచున్నయది. వేయేల? జన్మమునకు నీవందనున్న యానందసామ్రాజ్యంబంతయు నొక్కపెట్టున భస్మమై పెటిలి పడుచున్నయది. కన్నులు విప్పి చూడుము. పాపము...సవతీ! యిప్పుడు నాచేఁ జిక్కితివి. ఎందుఁబోఁగలవు...ఇంతకు నీకీగాథ తెలియకయేయుండవచ్చును. నాకుఁదెలియనీయక నీవొనర్పం బూనినదానికిఁ బ్రతిక్రియ తిరిగి నాచేఁ బొనర్పఁబడియె. ఇప్పట్టున దీనిని నీవు సమర్థింపుము...ఇప్పుడు నీ తెలివి తేట లగపడును...(అని ఇంచుకతడవాలోచించి) అదిగో రాజు వచ్చుచున్నట్లున్నది. పాదములధ్వని వినఁబడుచుండెను...ఇంక నేను కదలక పరుందునుగాక.

(ప్రవేశము దశరథుఁడు)

దశ—(తనలో) నేఁడీగృహమంతయు కళాహీనమై యలరారుచున్నయది. గృహాంగణమున వామపాదం బిడినదాదిగ నెడమకన్నదరుచున్నయది. హృదయంబున కెద్దియోవిధముగ మార్పుగలిగి విచారకరముగనుండెను. హేతువెద్దియుం దెలియదు.

సీ॥ శుకపిక శారికా ♦ నికరమ్ముఁ బలికించు
పడఁతి నేఁడేలకో ♦ పలుకఁబడదు
కలహంసముల నడ ♦ కల దిద్దుచుండెడి
తరుణి యీనాఁ డేల ♦ తిరుగఁబడదు
వరవుడుతో కల ♦ పనులఁ దీర్పించెడి
జాడ యించుకయైన ♦ నేఁడు లేదు
ఇసుమంత సడిఁ గన్న ♦ నెదురుగాఁ బరతెంచు
కలకంఠి నేఁడేమొ ♦ కానఁబడదు
తే॥ తెలియఁగా కారణం బేమి ♦ కలుఁగబోదు
ప్రళయకాలాగ్నికీలలు ♦ ప్రబలి రేఁగి

నాహృదంతరంబును దహ♦నంబుఁజేయుఁ
దొడఁగె సర్వేశ్వరుం డింక ♦ తోడు నాకు.

ఏమిది? యిప్పుడు నా కేమికీడు కలుగనున్నదని నాయీసర్వేశ్వర ధ్యానము? జాయాగృహంబునకుఁ గామాతురుండై యరుగు వాని కీహృదయవికారమేమి? (కొంచెమాలోచించి) సర్వేశ్వర ధ్యానమెప్పుడును ఆచరణీయమే...హృదయదౌర్బల్యకారణము మాత్రము విచారణీయము...కానున్నది విచారించినను తప్ప నుండదు. (అనుచు శయ్యాగృహంబునఁ బ్రవేశించి) ఓహో! యీపె నిద్రించుచున్నట్లుదే! (అని తూలికపయింబడి కౌగిలింపఁ బోయి కైకఁగానక) కాంతా! కాంతా! యిట లేవా! అహో! యెంతటిభ్రాంతి? (అని మెల్లనలేచి అటునిటువెదకి కైకఁగానక అలుకగృహంబునఁబ్రవేశించి రిచ్చవడిచూచుచు) సుందరీ! యేల యిట్లుకారణమ అలుకవహించితివో? నీయీభృత్యుఁడు వినఁదగిన సెలవిమ్ము. దుర్ఘటమనక యెట్టికట్టడికార్యమైన నాచరింతును.

తే॥ విలయకాలాగ్నిశిఖల ను♦వ్వెత్తుగాఁగ
గోట మీటెద నహితుల♦గుండె లవియఁ
బొడుతు నప్రియకరుఁ డింక ♦ పుడమి నుండఁ
గలఁడె మనఁగలఁడే తెల్పు ♦ కంబుకంఠి!

(అని యించుక ముసుఁగుదీయును.)

కైక—(కోపము నటించుచు దశరథుచేయిఁ దోసివైచును)

దశ—(దీనవదనముతో) అబ్బా! యెందులకింత కఠినము? నీయభీష్టమెద్దియైనఁదీర్ప కింకరునిబలె నే నుంటినిగదా? సెలవిమ్ము. క్రోధము నుజ్జగింపుము.

చ॥ సురుచిరభూషణంబులో వి♦శుద్ధతరంబగురత్నపూగమో
గురుతరభోగభాగ్యములో ♦ కూర్చుసఖీజనమో గజాళియో
ధరణియొ నాదుప్రాణమొ య♦థార్థము లేదన కిత్తు వేడు ఈ
ఖరతరదృష్టిఁబోనిడి ము♦ఖంబున చిర్నగ వొప్పఁ జూడవే.

(అని చేయి పట్టుకొనును.)

కైక—(తనలో) ఇతఁడిపుడు మోహావేశితుఁడై యున్నవాఁడు. ఇంక నాయురులఁ దగుల్కొనఁగలఁడు. తరుణము మించిపోనీయక నామనంబును దెలిపి కార్యమును సాధింతుఁగాత. (ప్రకాశముగా) రాజా! యెంతటిప్రేమ! యెంతటిసత్యవాదిత్వము! ఇది యంత యెచ్చట నేర్చితిరి? ఈ మాయమాటలచే నెన్నిసారులు నమ్మించి మోసగింతురు? ఈదుర్వృత్తి పనికిరానిది. మీప్రేమ నాయందు లేకున్న మానె. నాగృహంబున కేలరు దెంతురు? ఇన్ని దినమ్ములనుండి స్వచ్ఛందమగు స్వైరవిహారము నకుఁ దావొసఁగిన కౌసల్య నేఁడు గడుపకపోయిన దా? మీరు నేఁడు వచ్చుటచే నిన్ని దినంబులనుండి నానాథుండిటకు రాకుండె నని నేఁడే తలంపునకు రాదు. నిమేషంబులు, ఘటికలు, యామంబులు, రాత్రులు, సంధ్యలు, ఈ గడచుదినంబుల యందేమైన నెక్కువ జనుచుండెనేమోయని పరిశీలించుచు తుదకెట్టులో మనమును కుదుటపరచుకొని యుండువారల నిల్లిందుకు బ్రతుకనీయవలయునని తమయౌన్నత్యము నాకుఁదెలియఁ జేయుటకు సవతి పంపెను కాఁబోలు? లేకున్న నీకాలిచ్చుటఁబెట్టు శక్తి తమకెచ్చటనుండి కలుగును? మీముఖప్రీతిమాటలకు సంతసించితిని. పోనిండు, ప్రత్యక్షతిరస్కృతఁ గానైతిని. యిందుచేఁ గొంచెము బ్రతుక వీలుకలిగినది.

చ॥ సవతులు గల్గునా యట విచారణఁజేయక యే విభుండు సం
భవమగుకూర్మి నంత యొకఫక్కిగఁ జూపిన సాధ్వియైన రెం
డవసతి దుఃఖమంది తుది నాశనమందును నిక్కమద్ది మీ
కవగతమింతయయ్యునిటులాయెను జన్మము చాలు నా కికన్.

(అని కన్నీరు విడచుచుఁ గూర్చుండును.)

దశ—(ఉత్తరీయమున కన్నీరు తుడుచుచు) కాంతా! యెందుల కింతటి విచారము? నాహృదయంబున నీకన్న నెక్కుడుగ నెవ్వరిని భావించుటలేదు. సర్వదా నీయానందమే నామదిని భావించుచుందును. ఇది సత్యము, నమ్ముము.

కైక—పాపము! ఎంతటి సత్యవాదిత్వము! ఎల్లపుడు నాయానంద మె తాము కోరుచుందురట! అందులకె కాఁబోలు నేటికి నాల్గు దినంబులనుండియుఁ గౌసల్యాగృహంబున నుండి ఆమెసంతసము నకై యత్నించుచుండుట, యెవరెరుంగనిది? పోనిండు, నేనెంత పనికిమాలినదాననైనను, నాయందు తమ కెంత యప్రియ మున్నను మాటవరుసకైన నాతో ననఁజాలితిరా? యిదియం తయు నెందులకు? నాబ్రతుకుతో మీకేమిపని? మిన్నకపొండు.

దశ—సుందరీ! నీయెడ నేనప్రియము, తెలిసియెద్దియు నాచరించుట లేదు. తెలియనికతంబున నొనర్చినదాని క్షమింపుము. (అని చుబుకమంటి ముద్దిడుచు) సుందరీ! నీకుఁగావలసిన దెద్దియైనఁ గోరుకొనుము. దానినవశ్యంబుగాఁ దీర్తును. ఊరకే క్రోధమును జెందకుము.

కైక—నాధా! ఇచ్చెదరుకదా? ఆడి తిరుగక నా యీ తుదిముద్దును చెల్లింతురుగా?

దశ—(తనలో దోష ముపశమించుఁగాక) (ప్రకాశముగా) సుందరీ! యేలయిట్లు పలుమారుగ వాకుృత్తువు? నీయభీష్టము సత్వరమ తెలుపుము.

కైక—

ఉ॥ ఇచ్చెద నంచుఁ బల్కితివి ♦ యేటికి కోరుమ యంటి; ఇమ్మ నా
కిచ్చను మెచ్చి పూర్వమున ♦ నిచ్చువరద్వితయంబునందు సం
పచ్చతురబ్ధిమేఖలప్ర♦భావిభవం బగు ధారుణీతలం
బిచ్చుట నాతనూజునకు♦ నేర్పడ రాము వనాళి కంపుమా.

నాసుతునకు సకలసామ్రాజ్యంబును శ్రీరామచంద్రు పలునాలు గేండ్లరణ్యమునకుఁ బోవుటయుగ నీరెండువరంబులనొసంగుము.

దశ—(ఓసీ పాపాత్మురాలా! ఖలచరితా! రక్కసీ!) అని మూర్ఛిల్లును.

కైక—(తనలో) ఓహో! యీయనకు శ్రీరామచంద్రు వనవాస మనిన తోడనే మూర్ఛ కలిగినది. ఇఁక సీతఁ డెట్లు సమ్మతించునో తోచదు. (కొంచెమాలోచించి) కానిమ్ము. ఎట్లును నాకు చెడుపేరు ప్రాప్తింపకమానదు. ఏ నతనిమనము నొప్పించి

వైన నాయభీష్టముఁ దీర్పుకొనక తప్పదు. ఇంతటితో విరమించిన కౌసల్య కెల్లిదమగును.

దశ—(ఇంచుక కన్నులు తెరచి లేవలేక పడి) ఆఁ ఆఁ యెంతమాట! యిది స్వప్నమా! నేను నిద్రించుచుంటినా! ఇయ్యది కైకేయీ మందిరమే యగునా!...చెప్పుమా? కాదు కాదు. నేను పలువరించుచుంటిని. దుస్వప్నదోషము శాంతించుగాక. ఏమికోరిక?...యిది నిజమే యగునా? ఎట్లగును? స్వప్నములసత్యములు. ఎట్లును దీని ఫలితము మా రామునకుఁ జెందకుండుఁగాక. యెంతటి దుస్వప్నము!

కైక—(తనలో) ఓహో! యితఁడు వికలహృదయుఁడై స్వప్నముగ భావించుచున్నాఁడు. తెలిపెదఁగాక. (ప్రకాశముగా) రాజా! యిది సత్యమే.

దశ—(ఇంచుక తెలివితో తలయెత్తి) ఆ, ఆ, కైకా! సత్యమే సత్యమే? యేమంటివి? ఇది నీ కోరికయేనా?

కైక—రాజా! పూర్వము దేవాసుర సంగ్రామమున నొసఁగిన వర ద్వితయము నేఁ డొసంగుము. అందు,

తే॥ నా సుతుని సర్వసద్గుణ♦నయవిభాసు
నధికు శాస్త్రార్థవేదిని ♦ నవనికెల్ల
నధిపుఁ జేయుమా! శ్రీరాము ♦ నతివఁ గూడి
కానలను పదునాల్గేండ్లు ♦ గడపననుపు.

దశ—ఛీ! పాపినీ! గయ్యాళీ! యెంతటి లుబ్ధహృదయవు! శ్రీరామచంద్రు నడవుల కనుపవలయునా? రాజ్యము నీ కప్పగింపవలయునా? చండాలినీ! నీ మొగము చూడఁగూడదు. నీ వొక కాలసర్పమవు. భేకేశ్వరభీకర భుజంగమవు. కేకయరాజపుత్రీస్వరూప పెనుభూతంబవు. కానిచో సకలసద్గుణ భరితుండగు రామచంద్రు నడవికంపుమని మానవస్వాభావినివగు నీకోరిక దేవతాపూజార్హుండగు శ్రీరామునియం దిట్లుండునా! పవిత్ర హృదయయగు కౌసల్యసుతునకు, నీ తనయునకు సాటిసేతువా?

ఉ॥ ఎక్కడ రాముఁడే భరతుఁ ♦ డెక్కడ నంతర ముండెనెంతయో
నిక్కము దాప నేమిటికి ♦ నీరజనాభుఁడె విష్ణువెనటుల్
పెక్కురు తాపసుల్ బలుక ♦ వీనుల వింటిని ఆదివిష్ణుపై
నక్కసమేల? కోరికొను ♦ మంజలి వేరొకఁ డెద్దియేనియున్.

కైక—పాపము! పవిత్రహృదయయగుటచేతనే గాఁబోలు రేయిం బవళ్లు తమ చెలికడ నిల్లు గట్టుకొని యేపాపమెరుఁగని నాపసి కూనను మేనమామలయింటికని పురంబువెడలునంతకు నాఁడు సింగమువలె వెన్నంటితిరిమించెను. ఆతఁ డేమిచేయుననియో తోఁచదు. నావినుటతగదని యింతవరకు చెప్పనీయక యే యింత కార్య మాచరించినది యెవ్వరెరుఁగరు? పట్టపురాణిసంగతి. ఆకాస్తరాజ్యము మీచేతినుండి యూడిపోయిన పదపడి మీ రిచ్చున దేమి? నే పుచ్చుకొనున దేమి? తమదయలేకున్న మానె, నా కిత్తుననినవరములు మాత్రము నేఁ డొసంగుఁడు.

దశ—కైకా! యెందుల కింతమూర్ఖము? దీనివలన నీకు దుష్కళం కము ప్రాప్తించును.

కైక—ఔను. దీనివలన నాకు దుష్కళంకము కలుగ కేమి? సూర్యవంశ మున కిది తీరనిమచ్చయే.

దశ—ఔను, మంచిగ బుద్ధిజెప్పితివి. ఇది నాకే కాదు. ననుఁ బోలిన వారలకందరికి ననుభవార్హమే.

తే॥ ప్రియ మది చెల్లిపోయిన ♦ పదపడి నెవఁ
డేనియు ద్వితీ.........యాశ్లేషైదనుగాఁరు
నట్టివారికెల్లరకును ♦ గట్టికుడుపు
దుర్భరంబయి నాయందుఁ ♦ దోపనేమి?

కైక—ఏ మంటిరి? మిమ్ము బలాత్కరించి పైఁబడినట్టులే యున్న దే? అప్పటికిఁ దోచలేదు కాఁబోలు నీ నీతులు? మంచిది, యీ వై రాగ్యములతో నాకేమిపని? సత్యమును చెల్లింపుఁడు. లేకున్న మీకు దుష్కీర్తి ప్రాప్తించును.

దశ—కైకా! రాముని దరస్మితసుందరముఖారవిందముఁ దలంచినపుడు నీ కోరిక మదికిఁ దట్టిన నింద్రియవివశత్వ మేర్పడుచున్నయది. ఆతనియెడ నింతభయంకరమగు కోరిక నెట్లుగఁ గోరఁజాలితివో తెలియదు. కైకా! శ్రీరాముని నొక్కపరి మనంబున ధ్యానింపుము. (అనికనులుమూసికొని) అహా! యేమీ! మా రామచంద్రునాకారరూపరేఖావిలాసంబులయొప్పిదము!

మ॥ చిరునవ్వున్ దులకించు నెమ్మొగమున♦న్సిందూరనామంబు సుం
దరలోలాలకఫాల మబ్జదళ♦మాస్యంబైన వాల్గన్ను లా
యరతోత్తాలభుజంబులం దలర నా♦ హారిద్రికౌశేయ మ
య్యారె సాక్షాత్తుగ విష్ణుఁ డెన్నఁగను...

హా రామచంద్ర! రామచంద్రా! (అని పాన్పుపైఁ బడును.)

కైక—రాజా! అట్లైన రామునిటకుఁ బిలిపింపుము. నీవు చెప్పలేకున్న నేఁ జెప్పెదును, మీ రూరకుండుడు.

దశ—కైకా! యెంతటిమూర్ఖవు! శ్రీరామచంద్రుఁ డడవికేఁజన రిత్తయగు నీనేలనంతయు నీనెత్తినఁ గట్టుకొనుము. సకల సద్గుణాభరితుండగు రాముని దిగవిడచి దుష్టరాక్షసివగు నిన్ను, నపాలితమగు నీపురంబును నెవ్వరాశ్రయింతురు?.., ఛీ! పాపిని!

చ॥ అమలమణిప్రభాపటల•మై యలరారెడిసౌధపాళిస
ద్మములను వీథులందున స•మంచితమౌ నిరతోత్సవంబులం
దు మహితపట్టణంబిఁక న•ధోగతి భీతిగ కాకఘూకగృ
ధ్రములు వసించుకాలమును ♦ దాపరికం బొనరింతె? దుర్మతీ!

కైక—నాకీవికటప్రసంగములతోడను విరుపుమాటలతోడను బని లేదు...ఇత్తుననిన నిచ్చుట, లేదనిన పొమ్మనుట. రెంటిలో నెద్ది యైనఁ జెప్పుము. దానికే చూచుచుంటిని.

ఉ॥ ఇచ్చెదనంచుఁ బల్కితివి ♦ ఇచ్చుట యొక్కటె, కానినాఁడు నీ
కిచ్చుటలేదు పొమ్మనిన ♦ నేడ్చుచు నేయెడకేని సూనుతోఁ
జెచ్చెర నేగుదాన హృది ♦ శీతముగాఁగను నగ్రభార్యతో
ముచ్చటదీరనుండుఁ డిఁకఁ ♦ బోదుము ప్రాప్తముగల్గుచోటికిన్.

దశ—(మూర్ఛిలి కొంతవడికిలేచి) అయ్యయో! యెంతటికఠినవార్త! ఇదిరామునకెట్లు దెల్పుదును? సీతమొగమెట్లుగాంతును? సౌమిత్రి కేమని పల్కుదును? హారామచంద్రా! (అనిపాన్పుపైఁబడును.)

కైక—పోనిండు, మీరు చెప్పలేనిచో నేను చెప్పెద, నేమందురు?

దశ—మిన్నకుండును.

(అంత సుమంతుఁడు ప్రవేశించును)

సుమం—ప్రభూ! వసిష్ఠాది నిఖిలమౌనిజన, సామంత, పౌరాన్వితంబుగ కొలువు నిండియున్నయది. సుముహూర్త మాసన్నమైనదని, తమకుఁ దెలిపి తోడ్కొనిరమ్మనిరి.

కైక—(దశరథునికంఠముగా) సుమంతా! శ్రీరామచంద్రుని నిటకుఁ దోడ్కొని రమ్ము.

సుమం—చిత్తము. (అని నిష్క్రమించును.)

(అంతఃపురము రాముఁడు, సీత.)

రాము—సీతా! నేఁడేలనో నీమొగ మొక కొత్తవింతగఁ గనుపడుచున్నయది. ఐనను సంతోషచిహ్నము లగుపడవు. వడదగిలినటులున్నయది. ఇది సూర్యోదయసమయము. ఇప్పుడే కదా, పన్నీటిస్నానమాచరించినది? దీనముగ నుండుటకుఁ గతము, ఉపవాసశ్రమ కాదుగదా?

సీత—నాథా! నేఁడేలనో, నాహృదయము తల్లడిల్లుచున్నయది. ప్రాణతుల్యమగు వస్తువును మరచినట్టుల, దిగులు గలుగుచున్నయది. భయంకరులగు శత్రులు ప్రక్కనున్నటుల గనుపించుచున్నయది. హృదయమేలనో నిప్పులు ద్రొక్కిన కోతివలె పరిభ్రమణము జెందుచున్నయది. ప్రళయమేఘములు గర్జిల్లినటుల గన్పట్టుచున్నయది? దీనికి తోడుగఁ గడచినరాత్రి, ఉపవసించుకతముననో, హృదయదౌర్బల్య కారణముననో, చాలతడవు నిద్దురపట్టక, తుదకుఁ గనుమోడ్చితిని. అందొక స్వప్నముఁ గాంచితిని. (అని మిన్నకుండును.)

రాము—సీతా! ఊరకుందువేమి? తుదివరకుఁ బలుకుము.

సీత—నాథా! ఇంక నిది, చెప్పఁదగినదిగాదు. (అని భయకంపితయై డగ్గుత్తికతో కన్నీరుఁగార్చును.)

రాము—సీతా! యేమా హృదయభ్రమణము? యెంతటి విభ్రాంతి? స్వప్నంబులు సత్యంబులే? ఎంతటి యవివేకివి? సర్వశాస్త్రార్థ సముపగత వైదుష్య మేమాచరించితివి? యిల్లాలు శుభావహాసమయములందు కన్నీరు నించిన నైశ్వర్యస్థితియందుండువారు ధరాతలంబునఁ గలిగియుందురా? భయమందకుము. ఊఱడిలుము. (అని కన్నీరు దుడుచుచు) సీతా!

తే॥ దుష్టులను బూని శిక్షింప ♦ శిష్టజనుల
రక్షణంబొనరింప ని♦ర్వ్యాజకృపను
అజసుతుం డిచ్చనెంచి న ♦ న్నవనికెల్ల
నేతఁగాఁ బంచనుండెను ♦ భీతి యేల?

రాము—సీతా! యేల యిట్లు భయమందెదవు? ఊఱడిలుము. ఆ యతిభయంకరమని నీవు పలికిన స్వప్నమెద్దియో తుదివరకుఁ బలుకుము.

సీత—నాథా! శ్రీరామచంద్రుని కర్ధాంగినగు నా కేటిభయము? తెలిపెద వినుఁడు.

తే॥ వనమునను కందమూలముల్ ♦ భక్ష్యములుగ
నారలను గట్టి మౌనిజ♦నమ్ములట్లు
జడల ధరియించి మరఁదితో ♦ సాత్వికంపు
తేజమున మువ్వురంబుండు ♦ నోజఁ గంటి.

రాము—(మందహాసముతో) ఏమంటివి సీతా! ఇదియేనా! నీ కింతటి భయానకమ్ముగఁ గనుపట్టినయది? హృదయగత రాగాంధకారములనెల్లఁ బోఁదోలుము. ఇం దెవ్వరెవ్వరు ఏటికి జైత్రయాగమనము నడుపవలసి వచ్చెనో తెలియుము. నిరస్తకాంక్షాహృదయులగు మౌనులుసైత మెద్దానిని హృదయసౌఖ్యాకరముగ భావింతురో తెలియక అట్టిదానికి నీవు భయమందుచుంటివనిన చాల వింతగ నున్నయది. ఆచరించఁ దగు

నది దుష్టమారణము. ఇదియే మనకు పురమున నున్నను అరణ్యమున నున్నను ఆచరణీయమైన వేదచోదితవిధి. దీనికి వైపరీత్య మావహిల్లి... శిష్టరక్షణమునకుఁ గాని దుర్బలత్వ మావహిల్లినపుడు భయమందుటవిధి. సత్యపథంబునకుఁ గష్టములు మెండు. భగవానుండగువాఁడిట్టులే కష్టములకోర్చియైన సత్యరక్షణ, శిష్టపాలన జేయుచుండును. సౌఖ్యానుభూతికన్నను ఇదియె పరమరహస్యము. సత్యసంసర్గమునఁ గలిగెడు కష్టములు బహుళశ్రేయోదాయకములు. నా యుపన్యాసమునం దర్థము దెలియుము.

సీత—నాథా! సర్వసములగుట మీరలన్నింటిని సమానముగనే భావింతురుగాని సృష్టిగర్భమున సౌఖ్యమనియు కష్టమనియు ఏల విభేదనామంబులఁ గల్పింపఁబడెను? కష్టములలోని భావము సౌఖ్యమెట్లగును? సౌఖ్యములలోని భావము కష్టమెట్లగును?

రాము—కాంతా! అవి నీకెట్లు తెలియును? నావలె పరిశోధనమున నీహృదయము ప్రవేశించినప్పుడుగదా నీకుఁ దెలియుట? అది చాలు, పుంభావపూరితమగుమాట. కష్టములగర్భమున సౌఖ్యంబులును సౌఖ్యగర్భంబున కష్టములు నిమిడియే దెలిసిన ఫలము లిచ్చుచుండును.

తే॥ కష్టము లవోక్కమారుగాఁ • గ్రమ్ముకొనియు
తొలుతవలెఁ గాక క్రమముగా • దేలిక యగు
అమితగాఢాంధ మగు నిసీయందునైన
అడుగులిడఁ గ్రమముగఁ దెరు • వగుపడునటు.

(అంత సుమంతుఁడు ప్రవేశించును.)

సుమం—రామచంద్రా! నాయన కైకేయీమందిరముననుండి తమ్మఁ దోడ్కొనిరమ్మనిరి.

రాము—మంచిది, యిదేవచ్చుచుంటిని. (అని లోనికరిగి జానకీసహితుండై యరసముకడకు వచ్చును. అంత లక్ష్మణుఁడు వచ్చుచుండ వలయును.) లక్ష్మణా! సత్వరమ రమ్ము.

లక్ష్మ—అన్నా! పట్టాభిషేకముహూర్తమాసన్నమగుట, శుభలక్షణ లక్షితుండవగు నినుఁ జూచి కన్నులు గలిగినందులకుఁ దగు నానంద మనుభవింపవలయునని వచ్చుచుంటిని. (అనుచు సమీపించి నమస్కరించును.)

రాము—(లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని, ఆనందాశ్రుపూరితముఖుండై) తమ్ముఁడా! నాయన రమ్మని సెలవిచ్చిరట! పోదము రమ్ము.

లక్ష్మ—ఎచటనున్నారు నాయన? సభామంటపంబుననా?

రామ—కాదు; కైకేయీగృహంబున.

లక్ష్మ—(తనలో సుముహూర్తమాసన్నమగుచున్నదే! కైకేయీ గృహంబున కెందులకని తోడి తెమ్మనెనో తోచదు.) (ప్రకాశముగా) మంచిది. (అని రథారోహణముఁ జేయును.)

(తెర పడును)

తృతీయాంకము సంపూర్ణము.



---



# కామ్యసిద్ధి

## చతుర్థాంకము

రంగము : కైకేయీసౌధము, మూర్ఛిల్లియున్న దశరథుఁడు.

(కైకేయి ప్రవేశము.)

(రాముఁడు, లక్ష్మణుఁడు, సీత ప్రవేశము) జనకా! నమస్కారము.

కైక—నాయనా! దీర్ఘాయుష్మంతుఁడవగుము.

సీత—అత్తా! నమస్కారము.

కైక—దీర్ఘసుమంగలివగుము.

లక్ష్మ—(నివ్వెరపడి చూచును)

రాము—అమ్మా!

చ॥ జనకుఁ డిదేల మూర్ఛిలిన•జాడఁగ కన్పడుచుండె హేతు వెం
దునఁ గనరాదు నాయెడల • దోసములేమియు లేవుగా నను
నదయుసిఁ జూడ కేయిటు లెఁదఱ గడుఁజింతిలు; మానముద్రయీా
తనియెడఁ గల్గు; కార్యము య•థార్థముగాఁ గవచింపు మాతృకా!

లక్ష్మ—(తనలో) మంచిది. అన్నప్రశ్నమునకీమె హేతువు దేనిగఁ
బల్కునో వినియెద.

కైక—రామా! అయ్యది నీకెందుకు? ఆభార మతఁడె తీర్చవలెను.
అన్యుల కలవియగునది కాదు.

రాము—తల్లీ! తీర్చుట, తీర్పకుండుట యటుండనిమ్మా. వచ్చినభార
మేదియో వినుట కేమి?

కైక—తెల్పిన నేమి సేతువు?

రాము—వినిమెదను. వీలుండినయెడ నాభారముఁ దీర్చుటకై యత్నింతును.

కైక—ఇది నీకు వీలుపడునది కాదు అని నాకుఁ దెలియును.

రాము—తల్లీ! జనకుం డాచరించఁదగునట్టి కార్యము కుమారుఁ డాచరింపఁగూడదా?

తే॥ తండ్రి కాచరణీయమై ♦ ధర్మమయ్యెఁ
దనయునకుఁ జేయరాని దీ♦ధరణిఁ గలదె
ధర్మశాస్త్రంబులెల్ల మొ♦త్తమ్ముగాఁగ
నరసినన్ 'పితా సహపుత్ర' ♦ యనఁగ వినమె?

కైక—నాయనా! అట్లయిన నీతండ్రిపూనికి నిర్వహింపవలయునని యేనా నీమతము?

లక్ష్మ—(తనలో) ఈమె యేదియో దుస్తంత్రము పన్నినది. దానికై రాముని లోఁగొనయత్నించుచున్నయది. ఇప్పట్టున నేనూరకుండ రాదు. (అని పలుకనుంకించి) కూడదు. అన్న కేమయిన కష్టము కలుగునేమో? తన్నుఁ ద్రోసిపుచ్చి నేమాటలాడితినని. ఔను, నిశ్చయము. ఇప్పట్టున నేనూరకుంటయే మంచిది. ఐన నీమె యభిప్రాయ మేమియో, పర్యవసాన మేమియగునో పరికించెద.

రాము—అమ్మా! అందుకు సందేహ మావంతయు లేదు. ఎట్లైన తండ్రిపూనికి నిర్వహించుటయే కుమారునకు విధి.

కైక—రామా! ఆచరింతువా! ముమ్మాటికి?

లక్ష్మ—(క్రోధముఖముతో) ఓహో! యిదిగో యీమె కుందేటివల లొగ్గుచున్నయది. వీనితో నేమగునో అంత్యమునఁ దిలకించెద.

రాము—అమ్మా! సందేహము లేదు. ముమ్మాటి కాచరించెదఁ దెల్పుము.

కైక—రామా! అట్లైన వినుము. నీతండ్రి దేవాసుర సంగ్రామమున రాక్షసమాయాపరిహార మొనరించిన నా నేర్పునకు మెచ్చి రెండువరములిచ్చెను. అవి నేఁ డొసంగుమంటిని.

రాము—అమ్మా! ఇత్తునినదానికి నేఁడేల సందియము కలిగెను? మంచిది. అట్లయిన నీకోరిక లేమియో తెలుపు.

కైక—చెప్పెద వినుము. నాసుతుఁడగు భరతునకు సకలసామ్రాజ్య మర్పింపను, వనితతోఁడఁగూడి పదునాలుగేడు లడవులయందు సంచరింప నిన్నును కోరితిని. ఇందుపై కలతవడిన హృదయముతో నీపైఁగలప్రేమంబునను, అసత్యమువలని భయంబునను మూర్ఛిల్లెను. ఇదియే కల యూపు. తండ్రిపూనికి నిర్వహింతు నంటివి గనుక నిర్వహింపుము.

రాము—అమ్మా! ఇందు నీవేమితప్పుగోరితివని రాజిట్లు కలతవడెను? భరతుని నాతనయుండంటివి. నేను నీసుతుండనుగానా? యెంతటి వెర్రి?

తే॥ భరతునకు రామున కభేద♦భావ మరయ
పరుల కీలేదుగా సిరి ♦ బ్రామికొనఁగ
దశరథునిసుతుఁడె రాజ్యము ♦ దాల్చుచుండె
దీన నేమి లోపము గల్గెఁ? ♦ దెలుపుమమ్మ!

తల్లీ! భరతుఁడు తనకుమారులయం దొక్కఁడుగాఁడా? రాజునుండి కైకొనిన యీమహీరాజ్యము లాతిజనుల కర్పింపవైతివిగదా? మానలువురియం దెవ్వరైన నేమి? రాజ్యభారముఁదాల్చుటకు. కావున నవశ్యమ్ముగ నే నరణ్యమునకు నరిగెద. సందియ మందకుము.

లక్ష్మ—(క్రోధముతో) అన్నా! యేమంటివి? భరతునకు రాజ్యమర్పింపను? నీవు వనములకు నిర్గమింపను నీమెకోరికయు, తండ్రియను మతియున్నా? ఎంతటివింత? ఇట్టి దెందైనను మున్ను సూర్యకులంబున వినియుంటివా? లేకున్న నూతనమగు నీదశరథస్మృతి యందుఁ గంటివా? ధర్మశాస్త్రంబు లీ వెరుంగవా? దశరథుని సుతులయం దెవ్వరైన రాజ్యమును పాలింపవచ్చునా? ఏమి యీ యాఖ్యాయిక లెచ్చట నేర్చితివి? యీర్ష్యాసూయాసహనాదులం గననేరనితండ్రి దైవస్వరూపుఁడు. అట్టితండ్రియానతి

నెరవేర్చుట కొమరునకత్యావశ్యకము. వృద్ధుఁడై మతిచలనము కలిగి కామినీలోలుండై దుష్క్రియాపరంపరలందగిలి నీచ మార్గావలంబకుండగు తండ్రిప్రారంభముల మన్నించఁదగదు. సకలపౌరజనబ్రహ్మర్షిగణపరివృతం బగు సభామండపంబున నాడిన వాక్యము సత్యంబుగానిదియు కామినీలోలుండై యేకాంతమున నెవ్వ రెరుంగని జాడం బలికినది సత్యంబగుటయుం గలదా? యిద్దానికిఁగా నీవు హర్షించిన హర్షింతువుగాక! ధర్మవిరుద్ధమున కేనుహర్షించను. నీకుఁగానీసకలకేకయసామ్రాజ్యం బేకీభవించినను అర్ధనిమేషంబున భస్మీపటలమ్మొనరించి నీకుఁ బట్టముఁగట్టెద, చూచుచుండుము. (అని కైకవంకఁజూచి వేగిరించుచు) ఓసీ రక్కసీ! యే మంటివి? (కత్తిం దూసి)

మ॥ వనమందుం బదునాలుగేండ్లు ముని నా♦వర్తింపుమంచన్న పా
పిని! చండాలిని! నీదునాలుక నిదే ♦ పీకింతు నా కేకయా
దినికాయం బనిలో నెదిర్చినను ని♦స్తేజత్వ మందించి రా
మునకేఁ బట్టముఁగట్టి యెంతయుమది ♦నోమ్రదింతునశ్రాంతముల్.

(అని ముందునకు నడచును.)

రాము—(అపవారించుచు లక్ష్మణుని బట్టుకొని) తమ్ముఁడా! వేగిరింపకుము. ఇందు మనకు శత్రులు లేరు. మన యీ దేహాములకుఁ బూజార్హములగు దైవతములు గనఁబడుచున్నయవి. భ్రమపడుచుంటివేమో సరిగఁ జూడుము. తెలిసికొనుము. లోకులు విన్న మనలఁ బలుచనజేసి పరిహాసింతురు. ఎప్పట్టునను మానవునకు హృదయావేశము కిల్బిషాకరము.

లక్ష్మ—అన్నా! క్షమింపుము. "పితృసమో జ్యేష్ఠ" అనున్యాయానుసారము నాకు నీవే జనకుండవు. కావున కోపింపక నాప్రశ్నములకుఁ దగు నుత్తరమొసఁగుము. వంశానుచారంబులఁ బడఁద్రోసి అక్రమకార్యముల జరుపుచుండ నెట్లు సైరింపవలయును?

రాము—అన్నా! చిరుతవు. నీకు ధర్మంబుల రహస్యంబులు తోచవు. వానియం దెంతటియో రహస్యపూరితభావంబు లున్నయవి.

దోష మాపాదింపఁబడునపుడుగాని అసత్య మనఁబడదు. రాజ్యమిత్తు ననినది నాకు. ఇప్పట్టునను నేను దానిని వాంఛించుట లేదు. పోమెనేయను హృదయవికారమును లేదు. కోరినవిధి వరము. కాంక్షించునది కైక. తండ్రి యిచ్చగింపనిచో నామెకు హృదయబాధకమగును. అప్పు డసత్యదోషము కలుగును. కావున జనకుని పాపాకూపారంబునఁ బడఁద్రోయుట కుమారునివిధి కాదు.

తే॥ మనుజుఁ డేకార్యమేన్నేయఁ ♦ జనును ధరణి
పరహృదయపీడనంబుగా ♦ జరుగఁదగదు
సత్యమైనపులోమజ♦జాడఁ దెలియఁ
బలికి భృగుశాపమున మున్ను ♦ బడఁడె వహ్ని?

ఇప్పట్టునను వనములకుఁ జనుమని తండ్రి బలుకుటలేదు. పితరున కాచరణీయమగు కార్యము మున్నుగఁ దెలిసికొని ఆజ్ఞాపూర్వమే తీర్చుట కొమరుండగువానివిధి. అంతియకాక ముందుగ వరము లిచ్చినది మనతల్లియగు కైకమ్మకు. ఆమెకోరికలయందుఁ గల ఫలితాంశ మామెకుఁ జెందిన పదపడి శేషించిన దేది యుండెనో అది మనపాలు. అట్లై దానిని జనకుండు మనకిచ్చెద ననుటయు ఇచ్చుటయు నక్కరలేనిపని. ఒరులసొత్తని తెలియక తండ్రి యిత్తుననుటయు, తెలిసియు తండ్రి నసత్యాలాపిఁజేయ నిత్తునంటివిగదా? యిమ్మనుటయు కూడనిమాట. భ్రిమపాటున తనసొత్తని నిన్నట సభయందునఁ బలికెను. కాదని యిప్పు డందరికిని వెల్లడియాయెను. దీనికి తండ్రి నను టెంతటి ధర్మము? అంతియకాక యెయ్యది పథ్యమో యది జరుగుచుండును. క్రోధ దుఃఖసంతాప సంతోషంబులు తనయందావేశించినపుడు మానవుఁడు "ఇదియును నిలచినదికాదు." అని తలచుచుండినవవి వానిఁ జేయునదేమియు లేక చనుచుండును. హేయమగు రాజ్యసుఖంబుకన్నను వనముల తపోనియతిఁ గడపుట మంచిది. శ్రీమన్నారాయణాంశజులై జనించిన నరనారాయణులు బదరికావనంబునఁ దపోనిష్ఠితులై వసియించుచు దుష్ట

మారణమొనరించుచుఁ గాలముఁ గడపినటుల వినుచుంటిమి గదా! ధరామండలంబును పాలించనెంచిన వారల నెదిర్చెడివార లుందురా! చింతింపుము. నీవు కేవలము రాజ్యకాంక్షచే పొరబడు చుంటివి. దేని కెవ్వాఁడు సమర్థుండో తెలిసి తండ్రియే నియో గించవలయును. లేనిచో కష్టము సంభవించును. కనుకనే తండ్రి దీనినంతయుఁ జక్కఁగఁ బరిశీలించి నన్నిట్లు నియోగించెను. దీనికి మారు జరుగఁగూడదు. పితృపుత్రుల కిరువురకు దేహ మొక్కటి యె యనువిషయ మెవ్వరికిఁ దెలియదు? తెలిసి తెలిసి స్వమాంస ఖాదనేచ్ఛారతి యెవ్వానికంకురించును? అంతియె కాక నాకన్ని విధంబులను రాజ్యమునకన్న నరణ్యవాసమే సుఖదమని తోఁచు చున్నయది. కావున నాగమననిరోధ మాచరింపకుము. నీకు నాయందు కృపగలిగిన మన్నించి నీవును భరతునితోఁగూడి యతనిఁ బురస్కరించుకొని యుపద్రవములు కలుగకుండఁగ రాజ్యము నప్రమత్తులరయి పాలించుచుండునది.

లక్ష్మ—(అన్న పాదములంటి నమస్కరించి కన్నీరుఁగార్చుచు) అన్నా! కరుణింపుము. నాయనుచితముల నుగ్గడింపకుము. మూర్ఖుండనై జనకుని నట్లుగ నిరసించి పలికిన నావిమూఢహృదయంబునకు జ్ఞానమును కరపితివి; అస్మదీయ హృదయ అజ్ఞానాంధకారము నందు విజ్ఞానజ్యోతి వెలిగించితివి; నన్నుద్ధరించితివి; క్షమింపుము.

రాము—అన్నా! మానవజీవితంబున కెన్ని ధర్మశాస్త్రంబులు శోధించినను ఈ దేహమిటకు రాఁ గారణము గల్పించిన సర్వేశ్వరస్వరూపప్రభుండు తండ్రి. అట్టి ప్రభుండు జారుం డైనను చోరుండైనను అసత్యాలాపియైనను ఆతనియందు కుమారుండనువాఁడు ద్వేషించుట, దోషారోపణమొనర్చుట కూడదు. జననీజనకుల యకృత్యముల హృదయంబున స్మరించి నంతమాత్రమున తనయునకుఁ బాపాకూపారంబులు చేరిక యగును. కావున తా నెంతటిసమర్థుండయ్యును ప్రభుశాసన మును మీరఁజనదు. ఇది నిక్కువమగు ధర్మస్వరూపము.

తే॥ వేసవిని కాలగర్భాన ♦ మాసిపోయి
ప్రావృడంబైన వెడలు న♦ద్దంబు లేల?
పవనుఁ డెడలేక వీచుట ♦ భానుఁ డిందుఁ
డెపుడుఁ దిరుగుట ప్రభుశక్తి♦యే గదయ్య.

ఇది యంతయు సర్వేశ్వరస్వరూపియగు ప్రభుశక్తి కాదా? ప్రభుని యాజ్ఞయే పాటింపఁబడకున్న నింక ప్రపంచమున కాధార మేది? యూహింపుము.

లక్ష్మ—(అన్న యెదుట నంజలిబద్ధుఁడై నిలచి దీనవదనముతో) 'అన్నా! ఇంక నా హృదయంబున జ్ఞానోదయంబైనది. భవ ద్విరహితమగునీరాజ్యంబునం దే నుండనొల్లను. నా యకృత్యములు మన్నించి వెనువెంటఁ దోకొనిచనఁ బ్రార్థించెద' (ననుచు పాదములపైఁ బడును.)

రాము—అన్నా! విచారింపకుము. నీ యభీష్ట మెట్లుండిన నట్లే చేయుము. (అని సీతదిక్కు మొగమై తనలో ఈమెను విడచి పోవలెనన్న నా హృదయంబున కెంతయో భారము గలుగు చున్నయది. అబ్బా! యెంతటికష్ట మా యెడబాటు!) (ప్రకాశముగా) సీతా!

సీ॥ జనకజభూపాలు♦ననుఁగుకూతుర వయి
పెంపఁగాఁ బెరిమతోఁ ♦ బెరిగినావు
దశరథభూనేత♦యశముపుణ్యాపుపంట
యనుచుఁ గీర్తింపగా ♦ నలరినావు
జగదేకవీరుఁడై♦న్నఁగ రాముఁ డను కీర్తి
కరములోఁ గర మీయఁ ♦ గలిగినావు
మువ్వురత్తలకును ♦ ముద్దుముచ్చటఁ దీర్పు
ప్రేమవల్లి యనంగ ♦ వెలసినావు
గీ॥ కాల మది వక్రగమనమ్ము♦గాంచె నడవి
కేగెదను పదునాల్గేండ్లు ♦ ఇందువదన!

అరసి ముప్పురత్తలతోడ ♦ నధికమైతి
వరల కాలముఁ గడపు నే ♦ వత్తు నంత.

సీత—(దీనవదనముతో) నాథా! యేమంటిరి? యిట్టివైపరీత్యము లెందైనఁ గలవా? యిది సహజమా? లేకున్న భావికాంతా సంతానమ్మునకే నే యాదర్శప్రాయమా! అట్లు చేయవలె నని మీసంకల్పమా? లేకున్న తమకుఁగల ధర్మశాస్త్రశేముషీ విశేషంబు లీరీతి నాయదృష్టమునఁ బరిణమించెనా?

తే॥ మగనితోఁ గష్టసుఖములు ♦ మగువ కెందు
సాజమగు; వైపరీత్యముల్ ♦ సనునె ధరణి?
చందురునితోడ చంద్రికల్ ♦ సహజమగుచుఁ
జనుటె యేనాఁడు తక్కొండు ♦ వినుట గలదె?

నిష్కాలుష్యహృదయయగుసతికి పతికన్నను నెక్కుడెందుఁగలదు? ప్రపంచాతీతమగు పరమవస్తువే భర్త. అట్టియుత్కృష్టతరమగు వెలుగు గనరాని గాఢాంధకారంబునఁ బడియుండి నేఁ జేయున దేమి? కన్ను లుండినందులకు ఫల మానందహృదయంబునం దేనిఁజూడఁగలను? కాంక్షాసమాలీఢమగుహృదయంబున దేనిం గాంక్షింతును? స్పర్శకుతూహలిత మగు మానసంబుతో దేనినంటుదును? విరహజ్వరపరిపీడ్యమానాందోళిత హృదయంబుతో దేనిఁ గౌగిలింతును? ఆస్య ముండినందులకు మాటాడను, కరము లుండినందులకు సేవింపను, వయస్కనగుటచే భోగింపను, భావంబు గలుగుటచే నూహింపను కల్పించిన యాశ్రయమును ఈశ్వరుం డేల నిరోధించుచుండెను? భోగానుభవయోగ్యమగు నీ పదునాలుగేండ్లు గడచనిన పదంపడి నాయీదేహ మేమి సేతును? సాధ్వికిఁ గన్నులతో నిజనాథునిఁ గనుగొని యానందించుట కొసంగిన యీనేత్రముల నభాగ్యనగునాకేల దేవుం డొసంగెను? అంతటి నిర్భాగ్యనా? పాంసులావృత్తి నాశ్రయించువారలకుఁ దగుఁగాక! అరనిమునమ్మేనియుం దమ్ముం విడబి యుం దుండనోపను. భవదీయాజ్ఞో

ల్లంఘన మొనర్చిన యీదోషమును మన్నింపుఁడు. (అని కన్నీరు కార్చును.)

రాము—(సీత నాశ్వాసించుచు) సీతా! ఊరడిలుము. అస్మదీయహృదయాంతరస్థ మగు భావంబును తెలిసికొనజాలనిబేలతనంబున ఈలీలగా వంతలఁ గూలుచుంటివి. అరణ్యమన నుద్యానవనిగ భావించుచుంటివని నాయూహ. అయ్యది దుష్టన క్తంచరకులాభీలంబై, భయంకర సింహశరభశార్దూలాది మృగాలవాలంబై, దుష్టోరగసంయుతంబై, అహస్కరచండగభ స్తిజాలంబులకేనియుఁ జొరరానిలుగనక, గాఢాంధకారపూరితంబై, మృత్యుదేవతావదనగహ్వరమునంజొర ముందుఁగాలిడునట్లుగఁ గనుపించుచుండును. విషమస్థలంబులయందు గండోపలంబులును, గ్రీష్మాతపంబుల వేడిమికిఁ గాగి వెచ్చనై తళతళలాడు కరకురాళ్లు...నై... సూదులమొనలకన్నను వాడియై పాదంబులయందుఁ దవిలియలయించుచుండును. మరియొకవంక భయంకర ఘూకారవంబులు గుండె వ్రక్కలించుచుండును. ఇంకొకవంక మదపుటేనుంగులు ఉన్మత్తతాస్థితిని తుండంబులు బెనవైచుకొని పోరాడుచుండును. మరొక్కచో మార్గమధ్యమున నున్మదహస్తిచయంబులు పర్వతంబులచరియలకు కోరాడుచు తుండంబుల నూటాడించుచు జేవురించిన నేత్రములతో మదజలధారలు గురియుచుండ పోతరించి మార్గనిరోధముఁ జేయుచుండును. ఇంకొకచో రేచులు చెలరేగి పులులతోఁ బోరాడుచుండును. మాయావులగు రక్కసులు వనంబునం దెల్లయెడల దారుణరూపంబులతో దిమ్మరుచుందురు. ఇట్టివి ఒక్కొక్కచో మాకే తిలకించినపుడు గుండె బ్రద్దలించుచుండును. అబలవగు నీవు కనఁజాలవు. అడవులయం దిడుముల బడఁజాలవు. కాన - నీహృదయమును మరల్చుకొనుమని పనవి పనవి చెప్పుచుంటిని కాన పాటింపుము.

సీత—నాథా! జగదేకవీరులరగు తమవెనుకనుండు నాకేమి భయము? శివునివిల్లు జగమెరింగినది. తమకు లేనిభయము నాకుఁ గలు

గదు. పతిని విడచియుంట సాధ్వీలక్షణంబుగాదు. నాకీ చెడు వృత్తిని బోధింపకుఁడు. ఇంక నన్ను మన్నింపుఁడు. (అని దీనా నయై నిలచును.)

రాము—సీతా! ఊరడిలు మూరడిలుము. నీయిష్టము వచ్చినటుల నడువుము. నీయానంద మే నా కానందము.

కైక—రామా! అవిగో వన్యవసనములు తేఁబడియెను. రాజు మూర్ఛ నుండి తేరిన విలపించును. అప్పుడు నీవు వనములకరుఁగ వీలుం డదు. వల్కలమ్ముల కాంతాసహితుఁడవై ధరియించి పిమ్మట పితృవాక్యపాలనార్థమై విపినంబుల కరుఁగుము.

రాము—అమ్మా! తండ్రిసమయమ్ముఁ దీర్చుటకై సంసిద్ధముగ నుంటిని, లెమ్ము. వల్కలమ్ముల ధరియించి అడవుల కేగుదుము. తండ్రిని తగువిధి ననపాయమ్ముగఁ గాపాడుచుండునది. (అని కాంతాసహితుఁడై వల్కలమ్ముల ధరించును.)

కైక—రామా! ఇంక నీవు నీతండ్రిని మాటాడింపకయే వనముల కరుగుము. అట్లుకానిచో నితఁడు తెలివొందిన నీయరణ్యాగమన మునకు నిరోధముగలుగును. కావున మీారీక్షణముననే యిట నుండి నిర్గమింపుఁడు.

రాము—తల్లీ! అట్లేలచేయుమందువు? తండ్రిపాదముల కేల నమస్క రింపరాదు? అందువలన నేమి నిరోధము కలుగును?

లక్ష్మ—అన్నా! చెప్పినట్లు వినునపుడు ఎన్నియైనఁ జెప్పుదురు. ఆమెహృదయావేశమట్లున్నయది. ఇట్టులే వినుచుండిన నెత్తి కెక్కి కూరుచుండును. ఈ పాతకురాలిమొగము చూడఁ గూడదు. తండ్రికి నమస్కరింతము, రండు.

రాము—అన్నా! ఆమె పాపిష్ఠయైనను మనకు పవిత్రయే; అతిఖల చరిత్రయైనను మనకుఁ బూజనీయయే. కావున నామెన్దూషింపఁ జనదు. కావున తండ్రికి నమస్కరింతము, రండు. (అని సీతా లక్ష్మణ సమేతుండై తండ్రిపాదములఁ బట్టుకొని) తండ్రీ!

సీ॥ సత్యవ్రతాచార♦సంపత్తి విడచుట
తరణివంశజులకుఁ ♦ దగునటయ్య
నే వచ్చునంతకు ♦ నియతుఁడౌ భరతుఁడు
ధరణీభరముఁ దాల్పఁ♦దగునటయ్య
పదునాలుగేఁడులు ♦ పదునాల్గుదినముల
ట్లానందమునఁ బుచ్చి ♦ రానటయ్య
నీతనయులలోన ♦ నిఖిలమహీరాజ్య
రమ నెవ్వఁడే నిల్ప♦రాదటయ్య
తే॥ భరతుఁ డన నాకు భక్తుఁడు ♦ పరమహితుఁడు
నీనియోగంబునం దాల్చు ♦ నిఖిలపృథివి
ప్రేమ దోలుకాడ నన్ను దీ♦వింపుమయ్య
కడ కివే నానమస్కృతుల్ ♦ గాంచుమయ్య.

దశ—(చివాలున లేచి రాముని గౌగిలించుకొని) తండ్రీ! వలదు.

చ॥ అనుపమశౌర్యధుర్య! సుగు♦ణాకర! హా! రఘువీర! సుందరా
ననపరివర్తితాలక! ఘ♦నాఘననీలసమానదేహ! సూ
రినుతచరిత్ర! భవ్యనుత♦లీల! మహాబల! నిన్ను వీడి యుం
దున మనఁజాలఁ దోఁకొని న♦నుఁ వడి నేగు మరణ్యపాళికిన్.
(అని కన్నీరు గార్చును.)

రాము—తండ్రీ! ధర్మాధర్మనిరూపణంబుఁ జేయఁగల నీకీ విచార మేల? ఉడుఁగుము. కీర్తి శాశ్వతము, కొంచెము విచారింపుము. పుత్రవ్యామోహంబునఁ బడి బ్రుంగిపోకుము.

కైక—(రామునివంకఁ జూచుచు) రామా!...(అనునంతలో)

రాము—తల్లి! వేగిరింపకుము, జనకుని నూరడఁబలికి అవశ్యమ్ముగఁ బోదును. సందేహము నీహృదయంబునకుఁ జనదు. జరిగెడు తడవుకై క్షమింపుము. (అని తండ్రిపాదముల నొత్తుచు) జనకా! సూక్ష్మబుద్ధిఁ జూడుఁడు.

సీ॥ తనదానగుణమునం ♦ దలకీర్తిచంద్రిక
విధుని గప్పినరఘు♦విభునికీర్తి

నిజప్రతాపమ్ముచే ♦ నిరవద్య తేజమ్ము
తపను కిచ్చుదిలీప♦ధవునిశక్తి
మేరుమందరమహా♦ధారుణీధ్రమ్ములఁ
దనబల్మిఁ జూటుమాం♦ధాత తేజ
మవనికి స్వర్గంగ ♦ నవతరింపఁగఁజేయు
ప్రబలాశయునిభగీ♦రథునిదిటము
తే॥ మనమునం దొక్కమారుగా ♦ స్మరణచేయ,
కలుగునే? తండ్రి! యీచింత; ♦ కాల మెట్టి
వానిచే నెట్టికార్య మె♦ప్పట్టు వుట్టి
చేయఁగాఁ జేయు నీకిట్టి ♦ చింత యేల?

తండ్రీ! ఇంక మాకు సెలవు. (అని నిష్క్రమింతురు.)

దశ—(మూర్ఛిల్లి కొంతవడికి లేచి) హా! రఘువంశసుధావార్ధిచంద్రా! రామచంద్రా! సుగుణరత్నమవగు నిన్నిఁకెందుఁ జూతును? ఎట్లు విడతును?

సీ॥ పాలుద్రాగెడి యెల♦ప్రాయంబునను తాట
కిని జీల్చి చేపట్టె ♦ కీర్తిరమణి
హరువిల్లు విరచి కీ♦ర్త్యావతారిణి సీతఁ
బరిణయంబాడిన♦ప్రాభవంబు
పరశురామునిగర్వ ♦ మరకాలఁ బడరాచి
చాటించె దిక్కుల ♦ శౌర్యమహిమ
తనతండ్రియాజ్ఞను ♦ తలఁ దాల్చు నుత్తమో
త్తమపురుషుం డను ♦ ధార్మికంబు
తే॥ నెంతగాఁ జింతఁజేసిన♦ నెంతకష్ట
పడిన నేగతి నడచిన ♦ పరుల కిద్ది
సాధ్యమే? చేయఁ గలరొకో ♦ సర్వమేల
రామచంద్రుని బోల్ప నే♦రాజు గలఁడు?

హా! రామచంద్రా! సర్వగుణఖనీ! ఇంక ని న్నెందుఁ గాంతును? (అని మూర్ఛిల్లును)

---

రంగము: కౌసల్యాంతఃపురము

[కౌసల్య, రాముఁడు, సీత, లక్ష్మణుఁడు ప్రవేశము]

రాము—(సీతాసహితుఁడై కౌసల్యకు నమస్కరింపవలయును)

కౌస—(రాముని౯ జూచి నివ్వెరపడి) రామా! యిది యేమివింత? నన్ను నవ్వించుటకై యిట్లు పరతెంచితివా? తండ్రీ!

రాము—తల్లీ! సత్యముగనే యీరూపమునకు అవినాభావములేదు.

కౌస—తండ్రీ! యిది యేటిసత్యము? ఎట్టిస్వరూపము?

సీ॥ వింజామర ల్వీవ ♦ మంజులహస్తలై
యిరుగేలఁ గామిను ♦ లేల రారు
గండభాగము నిండు♦గా జారు దానధా
రాకరీంద్రము ముందు ♦ రాకయుండె
సార్వభౌమాంకమ్ము ♦ సార్థకమ్ముగ సిత
చ్ఛత్రమ్ము నీడకై ♦ సాచరేమి
జయ విజయీభవ ♦ సంస్తుతు ల్మీర వం
దులు కెలకుల నిండి ♦ తోపరేమి

తే. వేత్రధారులు జనులను ♦ వెలువరించి
గమనమార్గమ్ము కిరుగడఁ ♦ గ్రాలరేమి
నారచీరలు కడు వింత♦దారిఁ జూపు
తనయ! యిది యేటి వేషము ♦ తవిలె? తండ్రి!

రాము—తల్లీ! యిందు విషమరూపములేదు. ఇప్పటికియ్యది కేవల సమంజసము, అత్యర్థముఁ గావుననే కాలానుసార మీరూపము సంతరింపవలసివచ్చెను. పదునాలుగేండ్లరణ్యములకుఁ జనుమని జననియగు కైకమ్మకోరికకై తండ్రి యాజ్ఞాపించెను. దానిని బాలింప దృఢీకృతహృదయుండనై సీతాలక్ష్మణులతోఁ జను చుంటిని. భవదీయ ఆశీర్వచనమే కడమగ నిలచియుంటిని. దయ యుంచి తొందరగ కైకమ్మహృదయమునకు శాంతి గూర్పుము. దీనికి నీవు మారుచెప్పకుము (అని పాదములం బడును).

కౌసల్య—హా! తండ్రీ! (యని మూర్ఛిల్లును.)

(రాముఁడు, సీత, దాసీలు శీతలోపచారములఁ జేయుదురు)

రాము—(తనలో) ఔరా! పుత్రవియోగవ్యథ యెంతటి భరింప రానిది? నా వనగమనము వినినంతనే యీమెహృదయము తుపానుదవిలిన సముద్రమధ్యమందలి కలమువలె నవిసిపోయి నది. మదీయ నిర్గమనానంతర మెట్లుండునో తోచరాదు. ఎట్లేని సమ్మతింపఁజేసి చనవలయును. (ప్రకాశముగా) తల్లీ! తల్లీ!

కౌసల్య—నాయనా! రామచంద్రా! యేమి యీ అకాలప్రళయము? ఏల పడుచుండె నీవారివాహవిరహితనిర్ఘాతంబులు? దేనికై పెచ్చు పెరిఁగి మిన్నుమిట్టుచుండె నీ విలయకాలాగ్నిజ్వాలామాలికలు? ఇట్టి మహోత్పాతంబులమధ్యగఁ బడియున్న నా జీవితలతాం కురమునకు జీవనోపాయ మెయ్యది? హా! తండ్రీ! (అని కొంచె మాగి) నాయనా! వసిష్ఠాదిఋషు లుండిరిగదా! యెవ్వారును తగదని దీని నపవారింపకపోయిరా?

రాము— తల్లీ! అందరును వచించిరి. కాలము గానపు డెవ్వియు నేమి యుం జేయఁజాలవు. ప్రియతాత్పూర్వమే తెలియఁజాలక పెద్దలు వచించుచుందురు.

తే॥ కాల మనుకూలముగ నున్నఁ ♦ గదిసి పెద్ద
వారు పల్కుట విను బెర♦దారి వినున
ఆయువున్నట్టివారికే ♦ యౌషధములు
పని యొనర్చుట తక్కొరు ♦ మనుపఁగలవె?

కౌసల్య—నాయనా! ఇప్పుడెట్టికాలవైపరీత్యము గల్గినది? యెందుల కీ వరముల నొసంగెను? ఊకున్న నెవ్వరు నీతండ్రిని నిర్బం ధించిరి? యిట్టి దుర్ఘటకార్య మేల చేయఁబనిచె? ఇప్పు డేమపాయము కల్గిన నాపె రక్షించెను? ఇష్టపడకున్న నామె యేమిచేయును? ఇదియేనా నీవు నాకడకు వచించుటకై వచ్చినది?

రాము—తల్లీ! అటుగాదు. ధర్మవిరుద్ధ మాచరించగూడదని పెద్దలు పలుకుదురు. కాదని చేయుదుమనువారిని నెవ్వరేమిసేతురు? దుష్టశిక్షణార్థమై యేర్పడినరాజే యిట్లు చేసెడిచో ప్రజలెట్లు నడతురు? విరుద్ధకార్యములు జరుగునపుడు తనశక్తికి మించిన యెడ ప్రభుండు దైవముపై భారముంచి ప్రాణములపై నాస త్యజించి యోపినంతవరకు ధర్మసంరక్షణార్థమై పోరాడవల యును. అట్టివారికి దైవంబును తోడగును. ధర్మపథమునఁ గష్టములు నొందు. కష్టములకోర్చియైన ధర్మమును గాపాడుట యుత్తమవిధి.

తే॥ ఆడి తప్పక యుండునా ♦ యలఘుమతికి
తవులుకొను ధర్మబంధము♦ లవని మృషలఁ
బలుకువాని కేమొనరించు? ♦ పాలనిచ్చు
పశువుకే బంధనము-ఈని ♦ పశువు కేల?

ధవునిమాటలఁదరుణియు, జనకునివాక్యములఁ గుమారుండును, రాజు శాసనంబును బ్రజలును, దేవుండు కలఁడు అని జీవులును విహిత ధర్మానుసారంబుగా నడువవలయును. అట్లుకానినాఁడులోకసము దాయంబునకు నిలువశరణ్యముండదు. అబ్ధులుప్పొంగకుంటయు, అచలంబులు చలింపకుంటయు గజాదిక ప్రబలసత్వంబులు క్రూరత్వంబును మానియుంటయు మొదలగు వీనికన్నింటికి ప్రబలకారణము ధర్మము. అట్లుకానినాఁడు బలవంతుండొకండు తనకడ్డులేమి నక్రమముల నిరాటంకముగాఁ జేయఁజూచును. ఇవి నీకుఁ దెలియునివికావు. (తల్లీ) మనంబున నూరటఁజెందుము. లేకున్న ధర్మవిరుద్ధ మాపాదనమగును.

కౌస—హా కుమారా! (అని తలమోదికొనుచు) నాయనా! పుత్రప్రేమ నీకుఁదెలియదు. దానికిఁ గన్నులులేవు. ప్రపంచములనన్నిటి మునుమిఁడి మ్రింగఁజాలిననోరు గలదు.

తే॥ తనయ! యీచరాచరవృత♦ధరణి యెల్ల
నొక్కవైపున సుతప్రేమ ♦ యొక్కవైపు

తులను దూచిన తనయుఁడే ♦ దొడ్డ యగును
అపుడె నీ కది తెలియఁగ ♦ నెట్టులౌను ?

తండ్రీ! నావాక్యము లాలింపుము. నీజనకుండగు దశరథుండు కేవల మదనోన్మాదంబునఁ జేసి వెఱ్ఱికి యిట్లుచేయుటయు, ఆపిచ్చికిఁ దోడుగ నీవొకచిన్నపిచ్చివై పితాజ్ఞాపరిపాలనమని అడవులకు వెడలుటయు, నిన్ను వెన్నంటి కులసతీధర్మమని సీచెలువయు, మిమ్మిరువురనే దైవస్వరూపులుగ భావించి భ్రాతృసోదరన్యాయంబని లక్ష్మణుఁడు వెడలుటయునా!.. ఇంక నా కీపురమున దిక్కేది? నేనెవ్వరి నాశ్రయింతును? ఇంతటి నిర్దయానుషక్తంబగు నీపురంబున నుండ తెరువేది? అనురాగవిశ్లథీభూతహృదయుండగు నీజనకుని మొగ మెట్లు గాంతును? ప్రేమతత్వము నీకెల్లెరుఁగఁబడును? తండ్రీ! ధర్మశాస్త్రవగీర్ణమార్గము లేవియుఁ బనికిరాని ఆజనకునకు నీవు కుమారుండవు కావా? అట్టిచో ఇంక నాకు గతి యెట్లుండును? దుఃఖపరిప్లావితహృదయనై కృశించి చచ్చుటయే. యింతకు వేరు మార్గము నాకుఁ జూపించవైతివి. యెన్నివిధములనైనను నీవనవాసగమనానంతరము ఒక్కత్రుటికాలమైనను జీవించను. దీనిని నీవు యథార్థమని నమ్మి నీ వెనువెంటఁ దోకొని చనుము. అట్లయిన మాతృకాప్రాణరక్షణం బొనరించినపుణ్యమునఁబోదువు. నిన్నువిడచి నే బ్రతుకంజాల, నాయనా! నన్నుద్ధరింపుము (అని రాముని కౌగిలించుకొని యేడ్చును.)

రాము—(తల్లిని కౌఁగిలించుకొని అశ్రుధారాప్లావితనయనుండై) జననీ! సతీధర్మము నీ వెరుంగనిది కాదు. కాలపరిణామమున కెవ్వారును నేమియుఁ జేయఁజాలరు. కేవలము దుఃఖనిష్పందతరహృదయవై యించుక తడ వాలోచింపుము. అపుడు సమస్తధర్మములు నీ కెరుకపడును.

సీ॥ పతి దైవమని మతి ♦ నతికెడుసాధ్వికిఁ
దనయు వీఁడుట కష్ట♦తరమె తల్లి!

కర్మానుసారము • గాఁగ ఫలము దోచు
దానికై పలవింపఁ • దగునె జనని!
పితాజ్ఞఁ దీర్ప లో•కత్రయీకీర్తిత
మ్మగుట నేఁ బోచుంటి • నడలకమ్మ
భరతుండు న న్నతి•భక్తిగౌరవపుర
స్సరముగఁ గను పెర • గరయఁడమ్మ
తే॥ అబ్దముల దినములట్లుగ • నడవిఁ గడపి
తిరిగి నీదర్శనమున కే• తెంతు మాత!
సవతి కైకమ్మ నేమనఁ • •జనదు తండ్రి
నాగతిని మన్ననన్ జూఁడు • మమ్మ! సాధ్వి!

కౌస—నాయనా! గళితవయస్కుండును రాజ్యచ్యుతుండునై పరులపై జీవితాధారమును మోపిన నీతండ్రిఁ బురస్కరించుకొని విశీర్ణదయాహృదయలగు సవతులకడ నేగతిగ కాలమును క్షేపమొనరింతునో యించుక తలంపుము. నాకెద్దియైన గతినిచూపుము.

రాము—తల్లీ! కాంతలకు కాంతులకన్నను వేరుదిక్కు లేదు. నీపతి యెట్టిఁడైనను దూరక ఆతని నాశ్రయించుటే నీవిధి. కావున నాయాం దనుగ్రహించి యాశీర్వదింపుము. ఇంక నీవు మారాడకుము. ఆడిన పుత్రవధంజేసిన మహాపాతిత్యము కల్గును. (అని పాదములపైఁ బడును.)

కౌస—(తనలో) ఓహో! యీతఁ డెట్టులును పితాజ్ఞాపరిపాలనమున వెనుదీయునటుల లేదు. ఇంక నేను విలపించుట యశుభ మగును. (ప్రకాశముగా) తండ్రీ!

తే॥ సూర్యుఁడుం జంద్రుఁ డింద్రుఁడు • సురలు నభము
భూమి దిక్కులు తద్విభుల్ • పుణ్యరూప
ధారివగునిన్ను పవల న•క్తముల నసుర
సంధ్యలం దోముదురు పోయి• సరగ రమ్మ.

(అని రక్షనొకదానిఁ గట్టును)

(అంత సీత నమస్కరించును)

కౌస— (బాష్పరుద్ధనయనయై కోడలిఁ గాగిలించుకొని) తల్లీ! యెంతటి దురదృష్టవంతురాలను? దినకరరశ్మి చొరరాని సౌంధాంతరాళంబుల నీవును నీ నాథుండును పసిఁడియూయలలందుఁ గల పట్టుపాన్పులఁ బరుండి తూగులాఁడుచు కనుసన్నల నెరింగి పనులఁ దీర్పు దాసికానివహం బూడిగంబులు చేయుచుండ మృదుమధురభాషణంబులఁ దవినిసనక యుగ మొక్కనిముసంబుగఁ బుచ్చుచుండు నెడఁ జూచి యానందించుటకు మారుగా ఇట్టి వికృతావస్థలఁ జూచుచు ప్రాణంబుల విడువని నాస్థితి యేమందును?

తే॥ జనకునికి తనయవై రామ♦జనవిభునకు
కాంతవై యయోనిజవయి♦ కానలందు
ఇడుములన్ బడునాగ్లేండ్లు♦ గుడువు మనుచు
పాపినై నుదుట వ్రాసెనా ♦బమ్మ నీకు.

(కన్నీరు నించుచు) అమ్మా! సీతా! సతులకుఁ బతులకన్నను వేరొండు శరణ్యము లేదు-అని నీకు తెలియనిదిగాదు. ఐనను వినుము.

సీ॥ ధరణిని గోల్పోయె ♦ దాయాది కంచు నా
తనయు నొవ్వఁగఁబల్క ♦ జనదు మాత!
చనున దాకాననయం♦దున కష్టములను నా
సుతుని చుల్కనగాఁగ ♦ జూడకమ్మ!
కలవారిఁ గాంచి వా♦రలసిరుల్ గణియించి
రాముండు వినఁ బల్క♦రాదు తల్లి!
కలిమియు న్లేమియు ♦ కావటికుండలు
నిలువ వొక్కెడ నెందు ♦నిజము జననీ!
తే॥ కలిగియున్నను లేకున్న ♦ కాంత కెందు
పతియె దైవంబు నీ కింకఁ ♦ బలుక నేల?
అతఁడు నీకన్న సుకుమారుఁ ♦ డన్నియెడల
నీకరము కప్పగించితి ♦ నీరజాక్షి!

సీత—(కన్నీరునించుచు) అత్తా! సాధ్వీలక్షణంబులన్నియు నిదివరకే మదీయజనకుఁడు సమగ్రముగ వినఁబలికెను. అద్దాని కిప్పుడు తాము చక్కనివివరణ్మనయుఁ జేసి చూపితిరి. ఇంక నా కీ జన్మమున కొరఁ గలుగనేరదు.

కౌస—అమ్మా! నీకు మేము సాధ్వీలక్షణంబులఁ జెప్పునంతటివారము కాము. అయోనిజవై పతివ్రతాధర్మంబుల జగముల కుపదేశింప వెలసిన యవతారమూర్తివని మాయెల్లరనమ్మకము. తల్లీ! నీకు శుభమగును, పోయిరమ్మా.

లక్ష్మ—జననీ! నమస్కారము (అని కౌసల్యకు నమస్కరించును.)

కౌస—నాయనా! లక్ష్మణా! కంటికి రెప్పంబలె నగ్రజుని రక్షించుకొనుచు చిరంజీవివై సమయానంతరము మారామునితోడ నరుదెంచి నాయాశీర్వచనము గాంతువుగాక. (అని లక్ష్మణుని గాఁగిలించి) నాయనా! భాతృసోదరన్యాయము ప్రపంచమునకు బోధపరుతువుగాక. శుభంబగు; పోయిరమ్మా.

రాము—(అంతట సుమిత్రకు నమస్కరించును.)

సుమి—(అశ్రుగళితముఖారవిందయై) నాయనా! పితాజ్ఞాపరిపాలన మొనర్పనెంచు నీహృదయమునకుఁ బ్రశాంత మొనఁగూడుఁగాక! శుభముగా పోయిరమ్మా.

సీత—(సుమిత్రాదేవికి నమస్కరించును.)

సుమి—తల్లీ! కేవల పతివ్రతామూర్తివగు నిన్నాత్రిశక్తులు రక్షింతురుగాక!

లక్ష్మ—తల్లీ! నమస్కారము. (అని సాష్టాంగనమస్కార మొనర్పవలయును.)

సుమి—(లక్ష్మణుని గ్రుచ్చికౌఁగిలించి) నాయనా! అన్నతో వనపాళి కరిగెదవా! మంచిది, దానమునఁ బ్రీతియు యజ్ఞదీక్షయు రణ

మున మృతియు నీవై వస్వతకులమునకు విహితధర్మములుగఁ దెలిసి వర్తించునది. మరియు

తే॥ దశరథునిఁ గాఁగ రాముని ♦ దలఁపు మెదను
నను నెరుంగుము సీత యం♦చును మనమున
అడవిని నయోధ్య యని యెంచి ♦ యఁలరుమయ్యా
పుత్రికా! సుఖం బగు నీకు ♦ పోయిరమ్మ.

[అంత సుమంతుఁడు ప్రవేశము]

సుమం—రామచంద్రా! విచ్చేయుము, రథమ్మాయుత్తముగ నునుపఁబడియె.

రాము—అప్పా! వచ్చుచుంటిని. (అని రాముఁడు, సీత, లక్ష్మణుఁడు, నిష్క్రమింతురు.)

( తెర పడును )

చతుర్థాంకము సంపూర్ణము.

---





శ్రీ

సూర్యనారాయణపరబ్రహ్మణే నమః

# కావ్యసిద్ధి

## పంచమాంకము

రంగము: సరయూప్రాంతారణ్యభూమి - పౌరులు.

మొదటివాడు—అరే నాదెబ్బ చూడండి. మీరందరు కావాలనంట్రా? నేనొక్కఁడనే ఆపేస్తాను రామరథాన్ని. (అని చేతులుచాచును. అందరు చేతులు చాతురు) అరరే వస్తాంది, వస్తాంది. జాగ్రత జాగ్రత. గట్టిగా పట్టుకోవాలి.

[అంత సుమంతునిరథము ప్రవేశించును]

సుమం—పౌరులారా! యేమట్లు పిచ్చివారలవలె పిచ్చిపనులఁ జేయుచుంటిరి?

రెండవవాఁడు—అయ్యా! రాముండు లేనిరాజ్యమునఁగల ప్రజలు పిచ్చివారలుగాక మంచివార లెట్లగుదురు?

సుమం—(కన్నీరుజార్చుచు) పౌరులారా! దుష్టకాల మావహించినయది. ఏకాలంబునను తండ్రులు కుమారుల నడవులకుఁ బనుచుట వినియుంటిమా? ఎంతగ ప్రార్థించినను నా వెనుపాటునకు రాముఁ డిచ్చగించడాయెను. మీరలెందుకు శ్రమపడుదురు? మిన్నక పురంబునకు మరలుడు.

పౌరు—అయ్యా! శ్రీరామచంద్రుని విడచి నీవీపురంబున కే మొగముఁ బెట్టుకొని వచ్చుచుంటివి? రాముఁ డారగించు కందమూలములు

నీకోగిరమ్మునకుఁ బనికిరావాయెనా? యెంతటినీచహృదయము! తిరిగి మమ్ము పురంబున కేతెమ్మనుచుంటివా? నీవు పొమ్ము, మా కా పాడుపురమ్ము కాపురమ్ముగా నుండనోపము.

ఉ॥ ఎక్కడ రాముఁ డుండె నిక ♦ నెక్కడ కేగుద మెందుఁ జొత్తు మే
దిక్కును గానరాదు ఒక♦తీరున డెందము నిల్వఁబోదు పెం
డక్కులు వన్ని రాముని వ♦నంబున కంపెను దుష్ట కైక కిం
కెక్కడిధర్మ మిందునికి ♦ నేమి శుభంబులు గాంచఁగా నగున్?

(అని పలుకుచుఁ బౌరులు ముందు నడుతురు)

సుమం—పౌరులారా! నే నంతటి యవివేకినా? వినుండు, రాముఁడు పితాజ్ఞాపరిపాలనాదీక్షఁ గైకొని యున్నవాఁడు - మనలఁ జూడఁడు. వెనుదిరుగుఁడు; వృథాశ్రమము తగదు. పురమ్మునకుఁ బదుండు. అని (అందరిని సమాధానపరచి తోకొని నిష్క్రమించును.)

---

రంగము: గంగాతీరమున ఇంగుదీతరువు.

(సీతారామలక్ష్మణులు, గుహుఁడు ప్రవేశము.)

రాము—అన్నా! కాలచక్ర మతివేగముగఁ దిరుగు చుండును. అట్టిచో పల్లములఁ జరించిన కోణమే మిట్టులకుఁ జనుటయు మిట్టులఁ జరించినకోణములఁ దిరిగివచ్చుచుండుటయు సహజము. విజ్ఞులకు దానికై యంతగ నాలోచింపఁబనియుండదు. జీవితమున కెడతెగక తామరతంపరలై పరతెంచు కర్మములకు వెన్నీక యెదిరి నడచుటయే మానవునియాచరణవిధి. అట్లు భావించినవానిహృదయమున కుత్సాహము పొడముచుండును.

గుహు—ప్రభూ! మదీయభటుఁడు దర్భలఁ దెచ్చియున్నాఁడు.

లక్ష్మ—గుహా! యిటు తెమ్మనుము.

భటు—అయ్యా! తెచ్చితిని.

లక్ష్మ—మంచిది, ఇంక నీవేగుము. (అని దర్భల నేకరించి ప్రాచీనాగ్రింబులుగ తల్పంబు లమర్చును)

రాము—గుహా! నీభక్తికి మెచ్చితిని, ఇంక నీ వరుఁగుము.

గుహుఁడు—అయ్యా! వేగుసంతకు ననతిదూరమున నున్న యా వటముక్రింద శయనింతును, సెలవిండు.

రాము—మంచిది, నీయిచ్చకుఁ దగినటు లాచరింపుము. (అని లక్ష్మణునిఁ జూచి) లక్ష్మణా! శయనింపుము.

లక్ష్మ—ఆజ్ఞ. (అని సమీపమున నున్న నికుంజాంతరమున కరుఁగును)

రాము—సీతా! యేమట్లు పలుకకుంటివి మూగివలె? (అని రాముని కేలూతగ ఇరువురును శయనములకడకు నడచి ఉపవిష్టు లగుచో సీతఁ గౌగిలించుకొని కూరుచుండి చుబుకము ముద్దిడుచు) మైథిలీ! యే మీ దిగులు? దిశలఁ బరికింపుము. శరత్కాలమగుట చంద్రికలు వెదఁజల్లుచు నిందుం డెటుల చలువతెమ్మెరలతోడ్పాటునఁ బైకి రా నుంకించుచుండెనో చూడుము.

సీ॥ మదనుండు విరహుల ♦ మ్రందింప నెంచి పే
ల్చినఫిరంగికగుండు♦లీల నాఁగ
యామినీతరుణికి♦ఛాయితహారమ
ధ్యస్థనాయకవజ్ర ♦ మనుచుఁ బలుక
సర్వేశ్వరునిసభ♦సౌధాగ్రసంస్థిత
గోపురోపరిహేమ♦కుంభ మనఁగ
అంధకారాసురుం ♦ డలిఁగి లోకములపై
విడిచినరౌద్రాఖ్య♦విశిఖ మనఁగ.

ఇట్టి సంతోష సమయమును మనోవ్యథలచే వ్యర్థముఁజేయక కని సంతసింపుము. ప్రకృతివిచిత్రములన్నియు భగవానుని లీలారూపములు. వానిఁ గని సంతసించుటకన్న వేరొండేమియుఁగలుగదు. కావున తిన్నగ హృద్వికారములఁ దోలి ప్రశాంతిఁ జేకూర్పుము.

సీత—నాథా! మీకుఁ బ్రకృతిచిత్రములుగఁ గనుపట్టుచుండెఁ గాఁబోలుఁ గాని నాకీ మనచారిత్రము సృష్ట్యతీతవిచిత్రముగఁ గనుపట్టుచున్నయది.

రాము—ఔను, సీతా! మనమును బ్రకృతిలోని వారమేకదా! వృక్షలతాదులకు సైతము త్రిదశలు గనుపట్టుచున్నయవి. అట్టచో మన కిట్టి తారుమారు శోచనీయాంశముకాదు. కావున డెందమును కుదుటపరచుకొని నిద్రింపుము. ఆహారంబునకన్నను నిద్ర దేహంబునకుఁ బుష్టియుఁ దేజంబును నొసంగును. అప్పుడు స్వస్థతాస్థితి యేర్పడును, శయనింపుము.

సీత—నాథా! తాము చాల బడలితిరి. పథిశ్రమ మధికమాయెను. పాదసేవ యొనర్తును, పరుండుఁడు.

రాము—(నవ్వుచు సీతను గౌఁగిలించి ముద్దిడుచు) సీతా! పథిశ్రమంబున నేను బడలుటయు నీవు దృఢావయవవగుటయా? పిచ్చిదానా! ఏమిసపర్యలొనర్తువో చేయుము. (అని సీతాన్వితుఁడై పరుండును.)

సీత—(హాసవదనముతో) నాథా! స్వాధీనులయం దిట్టులే స్వతంత్రము చెల్లించుచుందురు.

రాము—మంచిది, నిద్రింపుము. (అంత నిరువురు నిద్రింతురు.)

సీత—(కొంతవడికి లేచి దిక్కులఁ బరికించి నిద్రావివశుండగు రాముని గాంచి అశ్రుపరిప్లావితనయనయై) అకటకటా యెంతటి దురవస్థ! నిఖిల మునిజనహృదయాబ్జభాస్కరుండగు శ్రీరామచంద్రుఁడు, శివధనుర్భంగాతిలోకవిక్రమక్రముండగు శ్రీరామచంద్రుఁడు, నిమేషార్ధపరికల్పిత దైతేయనాయక వరూథినీకంఠవిలుంఠనచణుండగు శ్రీరామచంద్రుఁడు, కాంక్షావిశ్లథీభూత సమస్త తపోధన హృదయసమాలీఢానురాగరూపక కామసుందరదివ్యమంగళవిగ్రహుండగు శ్రీరామచంద్రుఁడు అనదయగు పేదమానవుని బలె దర్భాస్తరణమున శయనించి నిద్రించుచుండెను. ఇట్టి దుర్ఘట దురంతచింతాసాగరంబునఁ బడి దరిఁగానక అడలుచు నెంతటి కాలము దొర్లింపవలయునో కదా!

చ॥ జలధితరంగసంగతల♦సత్కలకాంచివిధాంచి తావనీ
తలవరసేవ్యమానపద♦తామరసుం డగు రామచంద్రుఁడే

సిలుగులఁ గూరి వందురి వి♦చేష్టితుఁడై పడి పల్లురాలపై
పొలసి పరుండి నిద్రిలుట ♦ చోద్యము కన్నుల నెట్లుగాంచెదన్.

ఏదిక్కునఁజూచినను లెక్కకు మిక్కిలిగ క్రూరసత్వంబులు దిరుగుచున్నయవి. అర్ధనిశీథమగుటఁ గాఁబోలు రాత్రించర సమూహంబులుదక్క జగంబంతయు సుషుప్తిగర్భంబునంబడి స్మృతినభినయించుచుండెను. లోకబాంధవునిసైదోడు తనసహజశీతల కిరణజాలంబుల వెదజల్లుచు పిండారఁబోసినటుల వెన్నెలలు గాయుచుండెను. వీనికిదోడుగఁబిల్లవాయువులు మెల్లనబ్రసరించుచుండెను. స్వచ్ఛంబులగుగంగాతరంగంబులఁ బడిన చంద్రకిరణములు తళతళమను కాంతులు మిన్నునకెగదన్నుచు దిశల కొక నూతనవికాసము గల్గించుచుండెను. ప్రేమమయస్వరూపుండగు శ్రీరామచంద్రుని దుస్థితిఁ గాంచిన వగలచే నిర్విణ్ణమైన మదీయ హృదయంబునుబోలె లోకం బెల్లయెడల నిశ్శబ్దము కనుపట్టుచుండెను. ఎట్టులేని నేనును హృదయమును దిటపరచుకొని కొంచెముతడవు కన్నులు గట్టిగా మూయఁ బ్రయత్నింతుఁగాక. (అని నిద్రించును.)

రాము—(నిద్ర మేల్కొనినటుల నటించుచు ఆసీనుఁడై కన్నులు నులుముచు) ఎంతలో నెంతటిచిత్రము! ఈసాధ్వి నన్ను 'నాథా' యని పిలచి దేహమును స్పృశించుచు మెలుగించి మా నన వాస క్లేశమునకై విలపించినటుల స్వప్నముఁగాంచితిని. హృదయము కుసుమకోమలాంగియగు సీతవైపునఁ దవిలి తదీయ క్లేశావాప్తికై దురపిల్లునదియగుటఁజేసి యీగతిగ స్వప్నసాక్షాత్కారము కలిగియుండనోపు. ఐనను సత్యమేమో తెలుసుకొనెద. (ప్రకాశముగా) మైథిలీ! మైథిలీ! (అని దేహమును దట్టుచు) ఈమెకు గాఢనిద్ర పట్టినది. అకటకటా! యెంతటి విషమస్థితియం దెట్టి సుఖనిద్ర ననుభవించుచున్నయది! ఆహా! పరమేశ్వరేచ్ఛ యెంతటి చిత్రము!

చ॥ పలువురు దాసినీజనులు ♦ బంగరుటూయలనుంచి మెల్లనా
పలుకుల హాస్యవాక్ఫణితి ♦ పల్కుచు డోలికనూపుచుండగా

సలలితరీతి నిద్రిలిన ♦ చాన రఘూద్వహుధర్మపత్ని యి
ట్లలసట పల్లురాల భువి ♦ నాస్తరణంబుగ నిద్రిపోయెడిన్.

కాలప్రభుం డెంతటిదార్జన్యశీలుఁడు! సాధువులపైననే యెల్లపుడీతని దృష్టి; యిట్లు ప్రసరించుట. ధర్మవిరోధకులై కాలప్రవాహంబున కెదురీదు వారలనీతండేమియుఁజొనర్పఁజాలఁడు. ఇతనిశక్తియింతే. యిది నిశ్చయాంశము కాదు; ప్రమాదము. వారలకును ఒకపుడీ క్రూరతఁ జూపఁగలఁడు. ఔను, ఒకపుడేకాని ఎల్లయెడల వారలఁ దారుమారుచేయుశక్తి వీనికిఁ గలుగదు. ముఖ్యముగ తన దుష్టశాసనములు సాధువులపైననే చెల్లించుచుండును. (కొంచెమాగి) ఓహో నాహృదయము నేదియో గుణమావేశించినట్లున్నదే. ఔను ఇది శోకగుణము. దీనికి ఆవేశాత్పూర్వమే మానవునిఁ గర్తవ్యాంశమును బోధపడనీక జడునిగ నొనర్పఁ జాలిన శక్తి గలదు. ఎట్టి పుష్టికృతావయవుల నేనియుఁ దృణకణంబుగ నొనర్పంజాలినయది. ఇట్టి దుర్భరగుణము దీని విడిచిన నింకలేదు. ఎంతటిజ్ఞానవంతులగు నార్షసత్తముల విజ్ఞానప్రకాశంబుల కేనియు నంధతమస మొనఁగూర్పఁ జాలినయది. శోకమా! నన్ను వీడిచనుము. ఇంక స్థిరీభూతహృదయుండనయ్యెద. (అని సీతవంకఁ జూచి) ఈపె చక్కనిసుఖనిద్ర ననుభవించుచున్నయది. (అని యించుకపరికించిచూచి) ఓహో హంసతూలికకన్నను ఈపె కిపుడీగండశిలలు సుఖాపాదకములైనవి. రాగవిహీనహృదయమైనఁజాలును. అంతటను సౌఖ్యమే. కరకురాలయందును అమృతోపమ పేశలభావమున్నయది. లేదన వీలులేదు. శిలలయందు మృదుత్వ ముండుట తెలుసుకున్నవారుండకపోవచ్చును. కాని హంసతూలికా తల్పంబులేనియు నొకప్పు డొత్తుకొని పోవుట తెలుసుకొనిన వార లున్నారు. ఇది...సత్యదూరముకాదు. (అని పైకిఁజూచి) ఓహో! అర్ధనిశీథముగా భ్రమపడుచుంటిని కాని వేకువజామగుచున్నయది. ఇంక జాగుసేసిన పథిశ్రమ మేర్పడును. అని కాలోచితకృత్యములఁదీర్చి గంగాజలంబుల స్నానమాచ

రించి, సీతకడ కే తెంచి) సీతా ! ప్రొద్దిశం దిలకింపుము. ఇంచుక తెల్పు కాన్పించుచున్నయది. లెమ్ము, కాలోచితకృత్యమ్ములఁ దీర్పుము. నేనావిశాలవటముకడకరిగి జటాధారినై వచ్చెద. (అని నిష్క్రమించి జటాధారియై ప్రవేశించును)

[లక్ష్మణుఁడు, గుహుఁడు ప్రవేశము]

లక్ష్మ—(అన్ననుదిలకించి కన్నీరునించుచు విచారముఖముతో) అన్నా! సముద్రవేలావలయిత నిఖిలధరావలయంబునకు రాజవుగా నుండఁదగిన నీరూపము, ఆశ్రితక్షాత్రవీరలక్ష్మి అక్షీణలక్షిత మగు నీరూపము, నిర్ధూత సకలదైతేయక్షమానాధకాంతా ముఖేందుతాటంకలక్ష్మియగు నీరూపము ఎంతలో నెంతటి సందేహాస్పదములఁ గల్పించుచు నెట్లు మారినది?

తే॥ జడలు దాల్చుటచే మౌని♦చందముగను
విల్లు కేలూనుటను క్షత్రి♦వీరునట్టు
నారచీరలం దేదియో ♦ నవ్యభావ
మగపడుచునుండె కాలమే♦మనఁగ వశము?

(అని పాదములకు నమస్కరింపఁబోయి మూర్ఛిల్లును.)

రాము—(లక్ష్మణునిఁ దేర్చి నిలువనిడి) అన్నా ! పాపస్వరూప మగు క్రోధగుణమును ద్రోసివైవుము. జ్ఞానచక్షుండగువాఁడు అద్దాని నీడకేనియుఁ జేరఁడు. మానవుఁడు భౌతికసంబంధియగు దేహధారియై కర్మస్వరూపిణియగు ధాత్రియందు కర్మబద్ధుఁడై పడుచుండును. దానిఫలిత మనుభవింపకయే యెంతటి తపశ్శాలికే యననేల? ఆదిముఁడగు సర్వేశ్వరుఁడు సహితము సృష్ట్యాదికము కర్మసంసర్గమ్మునఁజేసి యెన్నియో తారుమారులగు వేషంబుల ధరించి అవతారములనుపేర జయింపక తప్పదాయెను. ఇంక మన మట్టివారము కామా? అన్నా !

తే॥ కాలవాహంబు రివ్వునఁ♦ గడచుఁ దాన
బండ్లు ఓడలు ఓడలు♦ బండ్లుగాఁగ

తారుమారగుచుండు యథార్థ మిలను
కాలపురుషుని ఆజ్ఞలఁ గడవఁదరమె?

కావున హృదయమున కించుక శాంతిఁ జేకూర్పుము. నడువఁదగినది భరద్వాజాశ్రమము. ఇచ్చట కది చాలదూరము. సహస్రాంశుని చండతరకిరణజాలంబులు నభోమండలంబునఁ బ్రజ్వలించి పృథివి యందు దుష్ణ తేజము గల్పించనిముందుగ గమించుట మంచిది. ఇంక నడువుఁడు.

(అంత నిష్క్రమింతురు)

---

రంగము : సాకేతపురము.

కౌస—హా నాయనా! రామచంద్రా! ఇప్పట్టున నీ వెట్టి కట్టిడుములఁ బడుచుంటివో కదా? అబలనగు నేనేమి సేతును? ఎంతటిదు స్తంత్రె మొనర్చి రాజుం బరిమార్చిన దీక్షైక? హా హా! యిదియంతయు భరతునకు కొంచెమేనియుఁ దెలియకుండఁగనే జరుగునా? యెచ్చటిమాట? కాదు కాదు భరతునకు రాముండనిన నెక్కుడు ప్రీతి. ఇంతలోననే ఇట్లెట్లు మారును? ఏమో యీ కీలకమంతయు నాసర్వేశ్వరునకే తెలియును. ఇతరుల కెట్లు సాధ్యము?

[అంత భరతుడు ప్రవేశించును.]

భర—(కౌసల్యం గాంచి గద్గదకంఠముతో) తల్లీ! నమస్కారము.

కౌస—(క్రోధఘూర్ణితనేత్రియై భరతుని చురచురఁ జూచుచు) ఏమి నాయనా! యే లరుదెంచితివి? నాకడ నింకేమియు మీసొత్తు లేదుగదా? గైకొనుటకు.

చ॥ జనవిభుఁ జంపె రాము వనచారిని జేసి ధరిత్రి నీశిరం
బున నిడె నేలుకోఁదగును మోదముమీరఁగ రమ్ము రమ్ము పై
నను నిడి నిద్రపొం డిఁకను నాతనయుం డిట వచ్చునంతకుక్
గనులను మూసికొంచెటులో కాలముఁ బుచ్చెద మానిరీతిగాక్.

భర—(గద్గదకంఠముతో) తల్లీ! క్షంతవ్యుండను ... క్షమింపుఁడు. ఆ మహాభయంకరదురంతాపవాదాశుశుక్షణి మదీయశిరంబుపై

మోపకుము. మంథరాదుర్మంత్రంబున మహాపాపినియగు కైకచే నాచరింపఁబడియె. యథార్థముగా నే నెరుంగనని పలుకుచుంటిని. అట్లెరిఁగినవాఁడు సకలమానిజనపుంగవనిర్దిష్ట శ్రీరామచంద్ర పట్టాభిషేక మహోత్సవ మహాలక్ష్మిఁ గన్నుల గననెంచని ధర్షణాత్మక ఛద్మహృదయుం డంధుండై యనంతమగు దారిద్ర్యమున పలువుర సంతానముఁ బడయుఁగాక. ఉదయాస్తమయములయం దేమరి కాలోచితకృత్యంబులఁదీర్పక నిద్రించుచు దినమణి కెదురుగ మేహవిసర్జన మాచరించుపాపి యగుఁగాక. వానిపుణ్యపుంజంబులన్నియు నశించుఁగాక. సూర్యోదయంబుననే లేచి సుప్తయగు ధేనువు సరకాల రాచినమహాపాపి యగుఁగాక. జననీ! క్షమింపుము.

ఉ॥ భవ్యయశోర్థినై సుగమ♦భావము నిశ్చలభక్తి నూని యే
నవ్యయరాజ్యభోగముల ♦ నారఘురామున కప్పగించి క్షం
తవ్యుఁడనై జగాలకు య♦థార్థపుసోదరరూపు చేర్పడన్
సువ్యవసాయమార్గమును ♦ జూపెద భావిజనాళు లాడఁగాన్.

(అని కౌసల్యపాదముపైఁ బడును.)

కౌసల్య—(కుమారునిగ్రుచ్చి కౌఁగిలించి లేవనెత్తి దుఃఖావేశితయై) తండ్రీ! అట్లే కానిమ్ము, తొలుత నీతండ్రిపైతృకకృత్యములఁ దీర్పుము. పుత్రవియోగదుఃఖము భర్తృమరణదుఃఖమును బొంది యున్నకతమున నిజ మెరుంగలేనికారణమునఁ బలికితిని. నా వాక్యములయం దనుచితములఁ బాటింపకుము.

చ॥ మతి నిడకయ్యు యిట్లనిన ♦ మామక వాక్యములందు దోషముల్
సుతుఁ బెడఁబాయు నా బెడద ♦ సోలుటచే మతి పోవరేగ నా
యతమగుక్రోధవహ్ని కెదు ♦ రైతివి కాలము చాల మంచిదై
జతనముఁ గూర్చె తండ్రి! కొన♦సాగుము కీర్తిజగాలనింపుచున్.

(అంత తెర పడును.)

---

రంగము : చిత్రకూటపర్వతప్రాంతారణ్యభూమి.

[భరతుఁడు, సుమంతుఁడు, సైన్యము ప్రవేశము.]

భర—అప్పా! యిటు రండు.

సుమం—నాయనా! భరతా! వచ్చుచుంటిని. (అని సమీపించును.)

భర—అప్పా!

ఉ॥ ప్రాజ్యసమస్తరాజ్యరమఁ బాపిని కైకకు ధారవోయఁగాఁ
దాజ్యముఁజేసి యార్షలవిధాన జడల్ ధరియించి శాంతిమై
పూజ్యచరిత్రుఁ డైనరఘుపుంగవుఁ డేయెడ నుండెనో కదా
ఆజ్యముఁ బోయునప్పి యనునట్లుగఁ గీర్తులవెల్గులీనుచున్.

శ్రీరామచంద్రుం డెటనుండినదియుఁ దెలిసికొని ఆమహాభాగధేయుని
తోడ సామ్రాజ్యలుబ్ధబుద్ధి యగు కైకసుతుం డరుదెంచినాఁ
డని మనవిఁజేయుఁడు.

సుమం—నాయనా! పితృ మాతృ కృత దుష్కృతములు తలంపరానివి.

భర—మంచిది, అప్పా! పరనింద పనికిరానిదైనచో వైవస్వతకులార్ణవ
జనితభీషణహాలాహలతుల్యుండగు భరతుం డరుగుదెంచె నని
విన్నవించునది.

సుమం—(తనలో! ఆహా! యీవివస్వత్కులోద్భవులగువారిలో నీబిడ్డల
చరిత్ర కడుంగడుధర్మస్వరూపమైనది) (ప్రకాశముగా) నాయనా!
ఆతీరున నేఁ బలుకఁజాలను. చిరంజీవి భరతుండు వచ్చెనని తెలు
పుదును.

భర—వలదువలదు, అప్పా! అట్లు వలదు. ఆచరితమగు దోషమునకుఁ
దగుశిక్ష నందకయే పూర్వనామము ధరించుటకు సిగ్గుపడు
చుంటిని. శిక్షలేమి, దోషము నశింపఁబడదు. పోనిండు, మీరు
తెల్పఁజాలకుండిన నేనే తెల్పుకొనియెదను. (ప్రకాశముగా)
ఓ ఋషీశ్వరోత్తములారా! సత్యవ్రతాచారపారీణుండును పితృా
జ్ఞాపరిపాలకుండును నగు శ్రీరామచంద్రమూర్తికి నామనవిగ
నిట్లు పలుకుఁడు. (అని మేఘగంభీరస్వరముతో.)

ఆ॥ క్రూరకర్మరతుండు ♦ కుత్సితజనుఁడును
గురుల కెదను కీడు ♦ గోరువాఁడు
భరతుఁ డరుగుదెంచె ♦ దర్శనాకాంక్షి యై
రమ్మనెదరో లేక ♦ పొమ్మనెదరో.

రాము—(ఆతురుఁడై లేచి దిక్కులుపరికించి)సీతా! యెందీమాటసవ్వడి? యెంతయో కాలమునుండి విన్నట్లుగఁ బరిచయముఁ గల్పించుచు జనకుండా? యని సందేహముఁ గల్పించుచున్నయది.

సీత—నాకును నట్లే తోఁచుచున్నయది.

రాము—లక్ష్మణా! యెవ్వరిదియో మాటసవ్వడి వినవచ్చుచున్నయది; పరీక్షింపుము. పరీక్షించుటేల? తోడ్కొనిరమ్ము.

లక్ష్మ—ఆజ్ఞ. (అని యరిగి భరతుని గాంచి సంభ్రమాదరములతోఁ దోడ్కొనివచ్చును.)

భర—అగ్రజా! నమస్కారము. (అని సాష్టాంగనమస్కారమొనర్చుచు పాదములపైఁ బడును.)

ఉ॥ తప్పు లవెన్ని గల్గినను ♦ దాసునితప్పులు దండమొక్కటక్
దప్పు నటందు రార్యులు ము♦దంబొడఁగూర్చుము నేను లేమి నీ
ముప్పు ఘటిల్లె లోకులకు♦మోమునుజూపఁగఁజేయుమయ్య మా
యప్ప! రఘూత్తమా! శ్రితజ♦నావన! దుర్మదదైత్యభంజనా!

రాము—తమ్ముఁడా! దీర్ఘాయుష్మంతుఁడ వగుదువుగాక. (అని కౌగిలించి గద్గదకంఠముతో కన్నీరు జార్చును) సోదరా! భ్రమపడుచుంటివి. దివాకరవంశోద్భవుండగువానిబుద్ధి దుష్పథంబులఁ జొరదు. ఇది నీకు తెలియనిమాట అగుటచే నీచేఁ బొనర్పఁబడునదియు నేను క్షమించఁదగునదియుఁ గలుగదు. గతమునకు విచారింపకుము.

సుమం—(విచారముఖుఁడై దుఃఖముతో రాముని సమీపించి) రామచంద్రా! జయము జయము.

రామ—అప్పా! యేమట్లు విచారసముద్రమున బ్రుంగియుండి కన్నీరు గార్చెదరు?

సుమం—శ్రీరామచంద్రా! యేమని నుడువఁగల నీ కర్ణకఠోర మగు వార్త!

తే॥ శ్రీరమానాధ! సత్యవి♦శిష్టపథము
గడుప నడవుల కీ వేగఁ♦బడిననాటి
కేడవదినంబు పొగులుచు ♦ నేగె దివికి
అలమటం గని జనకుఁ డిం ♦ కనఁగ నేమి?

రాము—హా జనకా! యెంతటిమహాపాతకము సంభవించినది? పితృహంతకుండనైతినా? హా! తండ్రీ! (అని మూర్ఛిల్లును. అంత భరతలక్ష్మణులు పరిచారములుచేయుచుండ కొంతవడికి లేచి) హా! తండ్రీ!

తే॥ కన్నులను దెరువఁగా లేని ♦ చిన్నల మము
నెల్లరను వీడి చనె భూమి♦వల్లభుండు
స్వస్థుఁడై స్వర్గమున కేమి ♦ పలుకనుండె
నడువ నేపథమును మాకు ♦ జడమ యయ్యెం.

సుమం—నాయనా! రామచంద్రా!

చ॥ త్రిదివముఁ జేరె భూవిభుఁడు ♦ దేవసమానుఁడ పీ వరణ్యమున్
గదిసితి వుస్కిదా మిగులఁ♦గా భరతుండు విలాప మందుచున్
మది నిడఁబోఁడు రాజ్యరమ♦ మానితమా రఘువంశజన్ముఁడై
తదికిట క్షోభమందుచును♦తాపము నొందెడివాఁడు నాయనా!

లక్ష్మ—ఓహో! పొగులుచున్న అన్నగారి హృదయమును మరింతగ పొగిలింపఁజేయుచున్నారు.

రాము—అప్పా! పిత్రాజ్ఞాపరిపాలనమునం దేమరి యుండ లేదుగదా! మాభరతుండును నట్లె యాచరింపవలయును. మాతృకకోరికయు పితరునాజ్ఞయు ననుల్లంఘనీయములు.

భర—అన్నా! తల్లులందరికోరికయు నిప్పట్టున నీవు రాజ్యముఁ గైకొనవలయు ననియే.

రాము—అప్పా! అందువలన లాభ మేమి?

తే॥ ఏది చేయుంగఁదగునది ♦ యేది చేయఁ
దగనిది యటంచు నెమ్మదిఁ ♦ దరచి చేయు

నరునికార్యము విఘ్నముఁ ♦ బొరయకుండు
కార్యమున కాదిఁ జర్చింపఁ ♦ గలుగు మేలు.

భర—అన్నా! చచ్చినపాము నడవఁబనియుండదు. క్షమింపుము.

రాము—భరతా! అట్లుకాదు. ఎవ్వారిపాలు వచ్చినది వారే యనుభవింపవలయును. ధర్మపథముఁ దప్పుట న్యాయముకాదు.

భర—(కృతాంజలియై) అన్నా! నాయందెట్టిదోషమును లేదు, నాపై ఆభారము మోపకుము; అది భరింపరానిది.

తే॥ పరమదుష్టాత్మకయు నీచ♦భావపూర్ణ
అనవరతద్వేషభావయు ♦ నైనకైక
గర్భమందున జనియించు♦కారణంబె
తక్కిన మరొండు దోసఁగు నా♦తలను గలదె?

రాము—(సీతవంకఁ జూచి గద్గదకంఠముతో అశ్రులు కన్నులఁ గప్పుచుండ) మైథిలీ!

చ॥ అనఘచరిత్రుఁ డైనవిభుఁ ♦ డాత్మజులన్ వినయప్రధానులన్
గనుగొని మెచ్చుకోఁదగు న♦కల్మషచారిత సద్గుణాఢ్యు నెం
దునఁ దులలేనివానిఁ గన ♦ నోచకయే చనె నిట్టిబిడ్డనిన్
గననగుధన్యమూర్తులకుఁ ♦ గల్గెడి నిందలు కాలమక్కటా.

(భరతునివంకఁ దిలకించి) భరతా! గురునిందపనికిరానిది. పుణ్యాచారిత్రుండగు జనకునిమాటఁ బాటింపుము. కన్నతండ్రిమాటఁ జెల్లింపకుంట కుమారులకు ధర్మంబుగాదు. నన్నిటలక్ష్మణుండు సేవించుచుండును. నీవు పురంబుననుండి రాజ్యమును బాలించుచుండుము. దీనినుల్లంఘించిన నస్మదాజ్ఞోల్లంఘన మొనర్చినవాఁడ వగుదువు. ఊరక నీ విట్లు ఎంతతడవు విచారించియు నేమియు లాభంబు గనఁబడదు. కావున నావాక్యంబును విశ్వసింపుము. కాలము దైవస్వరూపము.

తే॥ కాలగర్భంబునం దేది ♦ గలదొ యదియ
కలుగనగుఁగాక వేరొండు ♦ గలుగఁబోదు
ఎంతగా చింతఁజేసిన ♦ నేమిఫలము?
విధివిధానముఁ గడచెడి♦యధికుఁ డెవఁడు?

భర—విచారముతో అన్నా! భవత్పాదపద్మద్వయీసేవన మొనర్పు భాగ్యము నాకు లేదా? యీజన్మమునకు నాకిదియే కఠినశిక్షయా? అట్లయినచో నేటినుండి నీనామంబుననే సమస్తరాజ్యమును పాలింపఁబడుచుండును. దీనికి మీరు సమ్మతింపుఁడు. అంతియ కాక—

తే॥ అన్న! భవదంఘ్రిపూజ కే♦న ర్హ్వాతముఁడఁ
గాకయుండిన త్వత్పాద♦కంజసేవ
ధన్యమైన పాదుక లిమ్మ♦నన్యకృపను
వాని భజియింతు నే నని♦వార్యభక్తి.

ఋషులు—ఆహా! యీతనిసౌజన్యము లోకాతీతము, కొనియాడఁదగిన యది.

రాము—(తనలో) ఆహా! భరతుఁ డెంతటినీతిపరుఁడు!

తే॥ జన్మమాదిగ సద్ధర్మ♦చారి నగుచు
నార్జనముఁ జేసితిని కీర్తి ♦ నలతి గాఁగ
కొంచెమగుతడవందె యా♦ర్జించె భరతుఁ
డధికమై భువనముల నించు♦నట్టికీర్తి.

(ప్రకాశముగ) భరతా! నీభక్తిభావమున కేను బంధింపఁబడితిని. నీయిచ్చకు మారుండదు.

భర—(శ్రీరామచంద్రునిపాదుకలంది కన్నుల కద్దుకొని శిరంబున ధరియించి ఆనందబాష్పములతో) ధన్యుండనైతిని.

చ॥ జనకునిమానసంబునకు ♦ సమ్మతిగాఁగఁ జరించినాఁడ పౌ
రనివహ మిచ్చ మెచ్చెడిని♦ రాముని నామెదఁ గూర్చుకొంటి చం
దనసమమైతి బంధులకు ♦ ధర్మపరుల్ నను బెద్దసేతు రెం
దున కొరలేదు సంస్తుతి బు♦ధుల్ పచరింపఁగ నోచితిన్ బళీ!

( తెర పడును )

పంచమాంకము సంపూర్ణము.

---



శ్రీ

సూర్యనారాయణపరబ్రహ్మణే నమః

# కావ్యసిద్ధి

## షష్ఠాంకము

రంగము : వనవాసము - దండకాటవి- గోదావరీతీరమునందలిపర్ణశాల.

[ప్రవేశము - సీతారాములు జూదమాడుచుందురు.]

రాము—సీతా! జూదమున సంపూర్ణముగ నే విజయమందితినని నీకుఁ దెల్లమయినది.

సీత—(మందహాసముతో) గెలిచితిరిగావున మదీయంబులగు నుడుపులం గొనుడు, ఒసంగెద.

రాము—(నవ్వుచు) మైథిలీ! ఇంకను ఇచ్చెడి పెత్తనము నీయది యేనా? జూదమున నోడినవారలసర్వమును హరించి స్వచ్ఛంద గతి ననుభవింతురు. ఆజన్మాంతము వారిచే దాస్యముఁ జేయించుకొందురు. ఇది నీకు తెలియదుకాబోలు. (అని చీర చెరగు పట్టి లాగును.)

సీత—ఆర్యపుత్రా! యేల యిట్లన్యాయము చేయ యత్నింతురు?

రాము—మైథిలీ! యిందన్యాయ మేమియులేదు. అంతయు న్యాయమే.

సీత—ఆర్యా! గెలుపోటములు క్రమముగ చెల్లిపోవుచుండెడివి కాని యెప్పు డొక్కరికడనుండవు. సృష్టియందీ రెండును తుల్యభావములే. మరొకతూరి నే గెలువఁగూడదా?

రాము—(హాసవదనముతో) కాంతా! యిప్పట్టున నీవట్లు దలంపకున్న శరణ్యము లేదుగాని రెండును సమము లెప్పుడునుగావు. గెలుచుటయన ఒడ్డినపదార్థమున స్వాతంత్ర్యమును పొందుట-ఓడుట యన ఒడ్డిన పదార్థమున స్వాతంత్ర్యమును గోలుపోవుటయే. పరస్పరవిరుద్ధగుణకలితము లగుటచేతనే వీనికిట్లు నామములు గల్పింపఁబడెను.

సీత—(స్మేరముఖముతో) అట్లయిన తొలుత నేనే గెలిచిన?

రాము—(నవ్వుచు) ఇట్లే నీవును అస్మదీయ మగు సర్వస్వమును హరించి స్వేచ్ఛగ ననుభవింపుము.

సీత—అట్లయిన మరొకపరి ఆట ప్రారంభింపుఁడు.

రాము—వెఱ్ఱిదానా! అదెట్లు? మొదట నే గెలిచితిని. ఇప్పుడు సర్వస్వముగ నా యధీనవైతివి. ఆడుటకు వీలులేదని మా శాసనము.

సీత—అట్లని న న్నిపు డేమి చేయుమందురు?

రాము—(నవ్వుచు) అవి నీకు చెప్పిన తెలియకపోవచ్చును. ఆచరించి చూపెద.

సీత—పోనిండు, అట్లే చేయుఁడు.

రాము—ఇదిగో గెలుపునందలి ఫలితము స్వాధీనపరచుకొనుట. (అని సీతచెరగుఁ బట్టి లాగును.)

సీత—(నవ్వుచు) అయ్యో! ఇది కేవల మన్యాయముగదా?

రాము—ఔను, ఇట్లేయనుట ఓడినవారివిధి. (అని సీతను కౌగిలించుకొని) కాంతా! పోని మ్మాజూదపుప్రసంగమేల కాని త్వదీయముఖరాగానుసక్తమైన నా హృదయము ముగ్ధంబై సర్వాంగములఁ బ్రేమించుచున్నయది; కారణము తోఁచదు. (అని క్రేగంటఁ జూచి నవ్వుచు) సుందరీ!

తే॥ వాలుఁజూపులఁ బ్రసరించి ♦ వలపుఁగొలిపి
కావిమోవిపైఁ బొలుపైన ♦ కాంతి నెరపి
మందహాసమ్మునం దల ♦ మహిమఁ జూపి
మరపికొంటివిగా మది ♦ మందయాన!

సీత—నాథా! ముగ్ధనగునన్ను తమ వాక్యామృతమునందలి శృంగార భావతరంగములచే ముంచి యేల పరిహసింతురు? కేవలశృంగార మూర్తులగు తమభావము లల్పజ్ఞనగు నే నెట్లు గ్రహింతును?

రాము—ఏమి కాంతా! న న్నేమంటివి? శృంగారమూర్తివనియా? అట్లయిన శృంగారము కూడ నీకుఁ దెలియుననియే పలుక వలయు; ఇందలి యర్థము.

సీత—నాథా! అట్లుగాదు. నాచేఁ జదువంబడిన శాస్త్రంబులఁ గల శృంగారభావంబులన్నియు, విలాసముగ, తాము ముచ్చటించు వాక్యంబులయందునను సుందరంబగు ముఖారవిందంబుపైనను గనుపట్టుట యేమో అట్లు చివాలున వచ్చినది.

రాము—పోనిమ్ము కాంతా! శృంగారాదిశాస్త్రములఁ జదివితినంటివి గదా - అవి యెట్టివి? వానినామ మేమి?

తే॥ చదివితివిగద శృంగార♦శాస్త్రమందుఁ
గలుగనగుభావముల నాకుఁ ♦ గరపి రసిక
మూర్తినిగఁ జేయుమా నీవు ♦ మురియ నేల
ఇరువురకు దెలిసినను సౌఖ్య♦ మినుమడించు.

సీత—నాథా! క్షమింపుఁడు. నా కే శాస్త్రంబునను పరిచయములేదు. తమవాక్యంబులఁగల భావంబుల విని, యిట్లంటిని.

రాము—కాంతా! దొంగవు. సర్వశాస్త్రపాండితియు నీయపాంగంబుల దాచి యిట్లు దొంగముచ్చటలాడుచుంటివి. సరికాని నేను నీతో మాటలాడునెడ నస్మత్సంభాషణంబులఁగల భావంబులను గూడ నాలోచించుచుంటివిగా?

సీత—నాథా! జోహారు, క్షమింపుఁడు. ఏమో నాకు తోచినవాని గణించుకొనుచుందును.

రాము—పిచ్చిదానా! ఎక్కడి శృంగారము? దాని భావములు తుది వరకు నీ కెట్లంతు దొరకును? అయ్యది అబ్ధిసమగభీరము; నీహార ప్రసారానుకారిశీతల సుగుణము; అమృతోపమ మాధుర్య తరము.

సీత—నాథా! అయ్యది యట్టిదయైనను పారగులగు తమ సాహచర్యంబునఁజేసి వానిని తమయెడఁ గనియైన సంతసించుచుండెదను.

రాము—(సీతచుబుకమునంటి) ఏది సీతా! యేమంటివి? మరల నొకమాట చెప్పుము; ఇప్పుడు నీ వనినది నీ కర్థమయ్యెనా? ఏదీ అట్లైన నింకొక్కసారి.

సీత—ఆర్యా! వాక్యార్థ మెప్పుడును హితవు ననుసరించి యుండును.

రాము—ఏమి యీమాటలు? పోనిమ్ము? నీయర్థమునే నే ననుసరింతును. ఈవాదము లెందులకు? (సీతవంక ఒకేరీతిగఁ జూచుచు మందహాసముతో) మైథిలీ!

చ॥ పలుచనిమోవి అంతకును ♦ బాగయి నున్నగుగండపాళి మీ
నుల సరిబోలుకన్నులు వి♦నూతనమై తళుకెత్తుమోము చం
చలలనుబోలుమేను విరి♦జాలములన్ హసియించుహాస మ
య్యలఘునితంబమున్ గనిన♦యప్పుడయెంచెదనన్ గృతార్థుగాన్.

సీత — ఆర్యపుత్రా! యెంతటిచమత్కారము! నే నేదియో పలుకఁ బోవ ఊహాశక్తి నెరింగిఁ మున్ముం దిట్లుగఁ బలుకుచుంటిరా!

చ॥ చెలువగునీకవుంగిలిని ♦ చేరినయప్పుడమేయసౌఖ్యసం
స్థుల నొకచీరికిన్ గొనక ♦ చొక్కుచు ఎంచెద జన్మమందినం
దులకు కృతార్థనైతి నని♦ ధూర్జటివిల్లవలీలఁ దుంచునా
యలఘుకరమ్ము ప్రేమ దోలు♦కాడఁగ కౌగిలిచేయుచుండుటన్.

రాము—జానకీ! ఇట్లనుకొని సంతసింపకున్న మనకు శరణ్యమేది?

సీత—ఆర్యపుత్రా! నేఁటికి పదుమూఁడువత్సరములు నిండఁబోవుచున్నయవి. ఇట్లేమిగిలిన కాలమును చనక నిలువరించునా? (అనుచుండ)

(తెర పడును.)

షష్ఠాంకము సంపూర్ణము.

---



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B158 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 13, B 85 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sumitha |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |